ఓం

శ్రీ రామ చంద్ర పరబ్రహ్మణేనమః.

* బాలసరస్వతి - 3.

శ్రీ జ్ఞానానంద గ్రంథమండలి ౧.

*
* *

# ఆంధ్ర కా ర కో ప ని ష త్తు.





౧౦-౫-౧౯3౫.

వెల 10/- అ.

సాహిత్య విద్యా ప్రవీణ, ఉభయభాషా ప్రవీణ :

పంతుల లక్ష్మీనారాయణశాస్త్రి.

## — ( కృతి సమర్పణము ) —

—❖—

బంధుర మాయా గుణ

సంబంధము నెడలించి

తత్త్వ భావ మొసఁగు

నీ గ్రంథమును

భక్తి నే తద్గ్రంథమునకె

యంకితంబుగాఁ గావింతున్.

ఓం

పరబ్రహ్మణేనమః.

# ప్రార్థనము.

—(౧)—

అజ్ఞానావరణంబుచే ఘటపటాద్యాకారమై తోఁచు భే
దజ్ఞానంబను "మాయలాడి" వలలోఁ దొల్కొంట, *మూఢుండనై
విజ్ఞానంబు గ్రహింప, నియ్యుపనిష ద్వేద్యంబు, నింకే, నభే
దజ్ఞానంబు సమాశ్రయింతుఁ, బరమార్థావాప్తిఁ జేకూర్పఁగన్.

కలుషంబుల్ దొలఁగించి మోక్షపదమున్ గల్గించు శ్రీరమ్య ప
జ్జల జోద్భూతపరాగపాళి శిలఁ గాంతారత్నముం జేయు నీ
లలిత శ్రీ నవమేఘకాంతి తనుదర్శాకాంక్షినై నాయఘం
బులఁ బోకార్చి తరింపఁ జేయవె భవాంభోరాశి; సీతాపతీ!

దుగ్ధవేత్రతలే ఘంటము తోడివ్రాత
లగు విధిగ పరివర్తనంబు గడియించి
కరుణరససుధాధారలఁ గురిసినట్టి
యాదికవి! మన్న మస్కృతు లందికొనవె!

పదునాల్గేండ్లపు జేను సేసిన కవిత్వంబున్ సమీక్షించి తీ
వ్ర దయామంజులమూర్తివై మిగుల హర్షంబొంది, తానస్మద
భ్యుదయాకాంక్షవహించి, శాస్త్రకళలాప్తుంబోలి నేర్పించె, న
ప్రధితౌన్నత్యునిఁ దొల్త గొల్తునెద 'శ్రీరామానుజాచార్యునిన్.'

---

* జీవుండనై

పసితనమునాటి పసలేని పల్కులెల్ల
కవితయని మెచ్చి తప్పు లెయ్యవియొ తెల్పి
* "కుంజ"రాది సమస్యలఁ గూర్పఁ బ్రేమ నెఱపు
మా 'తాతగా'రేమొ మఱపురారు

* సత్తరువు 'లాటరీ'సిఁ బోవు సమయమందు
"తనయ, మాయింట భుజియింపు"మనియె
నిట్టి తేనియలదిద్దు ప్రేమ యెవ్వానికలరు,
నట్టి "రామానుజాచార్యునభినుతింతు.

---

* "నేను సంస్కృతకళాశాలలోఁ బ్రవేశించిన క్రొత్తలో తాతగారు, కుంజరయూథంబు" మున్నగు సమస్యల బూరింపుమని యాజ్ఞాపించిరి. అప్పుడు నేను పూరించిన వానిలో మొదటిదాని సంవిధానమిది.

సంజనిత జవుండై కా
ల్వం జప్పునఁ బడె ప్రమాదవశమున నొకఁ, డం
తం జీమకుట్టె, (కఱచె), త్రొక్కెం
గుంజరయూథంబు, దోమ కుత్తుకఁ జొచ్చెన్.

---

* "సత్తరువు" పదమునకు "సత్తరువుపద్దు"అనిలక్షణ.

అస్మదంతే వాసికోటిలోఁ జేరిన సాహిత్య విద్యా ప్రవీణ, (శిరోమణి) ఉభయభాషాప్రవీణ, (విద్వాన్) పంతుల లక్ష్మీనారాయణశాస్త్రిచే మనోహర కవితావిలసితముగా రచియింపఁబడిన "ఆంధ్రి కాఠ కోప నిషత్తు"ను మేము సవిమర్శముగాఁ దిలకించియున్నాము. కేవలము ఉపనిషన్మూలము నాంధ్రీకరించి "యాంధ్రీకరణముకన్న మూలమే సులభగ్రాహ్య"మని పాఠకులు దలంపకుండ దుర్గ్రాహ్యమగు శంకరభాష్యార్థము నెల్ల సామాన్యులకుఁ గూడ గ్రాహ్యమగు చక్కని శైలితోఁ దెనిఁగించి యితఁడు మాకెంతయు నాశ్చర్యముం గల్గించెనని మనఃపూర్వకముగాఁ దెలుపుచున్నాము. శంకరభాష్యార్థము నరఁటిపండొలిచి చేతికిచ్చినట్లితఁడు పాఠకుల కందించుటకుఁ జూపిన నైపుణ్యము మాకానందదాయకమగుచున్నది. ఇాదితని కవితాస్రవంతి సహజసిద్ధమై యవగ్గళగంగాలహరీ సదృశమై మాధుర్యదాయకమగుచున్నదనుటలో నతిశయోక్తి లేదు. ఉపనిషన్మంత్రములలోని యభిప్రాయముల విడువక శంకరుఁడు వ్రాసిన విశేషార్థములను గూడ విసర్జింపక, శంకరభాష్యటీకాకారుల యభిప్రాయములను గూడ కొన్ని స్థలంబుల వివరించుచు, వేదాంత రహస్య సమంచితంబగు నీ గ్రంథమును రచియించి లోకోపకృతిఁ గావించిన లక్ష్మీనారాయణశాస్త్రి ప్రజాదరపాత్రుఁడగుటయేగాక భగవదను గ్రహపాత్రుండగుననియు విశ్వసించుచున్నాము. అస్మచ్ఛిష్యులెల్లరును బ్రహ్మవిద్యారహస్యబోధకమగు నీ గ్రంథమును తప్పకగొని పఠించి గ్రంథకర్తను దిరుగ ననేక మహోత్కృష్టగ్రంథరచనోత్సాహునిగాఁ గావింపఁ గోరుచున్నాము.

తే 25-3-1935 దీ. } 'స్వామి సత్య జ్ఞానానంద'.

# పండితాభిప్రాయములు.

శ్రీయుత పంతుల లక్ష్మీనారాయణశాస్త్రిచే రచియింపఁబడిన యీ "ఆంధ్ర కఠ కోప నిషత్తు"ను నేను స్థాలీపులాకన్యాయముగా పరిశీలించి యున్నాను.

ఇది శ్రీ శంకర భగవత్పాదుల భాష్యమును చక్కఁగా ననుసరించి మనోహర శైలిగల ఆంధ్రభాషలో వ్రాయబడినట్లు నా కవగతమైనది.

ఆత్మ (బ్రహ్మ) విద్యాభిలాషులగు వారల కిది యత్యంత సుబోధకముగ నుండఁగలదనియు, పాఠకులకు శంకరభాష్యార్థమును 'కరతలామలకము' గావింపగలదనియు, నా దృఢవిశ్వాసము.

1-4-1935.

ఇట్లు:
వేరి లక్ష్మీనారాయణశాస్త్రి.
శ్రీ విజయనగర మహారాజ సంస్కృత కళాశాలా
న్యాయ ప్రధానోపాధ్యాయుఁడు.

---

శ్రీయుత పంతుల లక్ష్మీనారాయణశాస్త్రిగారి కఠోపనిషత్తు యొక్క ఆంధ్రీకరణమునందలి యుపనిషత్తాత్పర్యము, శాంకరభాష్యానుసారముగా నున్న దనుట నిర్వివాదాంశము.

వీరు ఉభయభాషాప్రవీణ, విద్యాప్రవీణ పరీక్షలయం దుత్తీర్ణులై వాని కొఱకు చేసిన పరిశ్రమమేగాక వేఱుగ నీ యుపనిషత్తును స్వయముగా నర్థజ్ఞానముతో నభ్యసించి, యన్యూనానతిరిక్తముగ నాంధ్రీకరించుట మిగుల శ్లాఘనీయము.

2-4-1935.

ఇట్లు:
నౌడూరు వేంకటశాస్త్రి,
శ్రీ విజయనగర రాజకీయ సంస్కృత కళాశాలా
వ్యాకరణాలంకారోపాధ్యాయుఁడు.

Mr. Pantula Lakshminarayana Sastri has translated **Kathakopanishad** and he has utilised Sri Sankara's Commentary on this Upanishad. I am one of those who have lost faith in metrical translations of famous works like the Upanishads for they serve no purpose or rather they do not serve the purpose for which they are alleged to be done They are, if they are correct translations almost Transliterations of the originals and as such they will not be useful to those who do not know Sanskrit. The present translator has rendered the original into Telugu and it reads well. So for as I have gone through it which is cursory at best, it appears to be following the original with a fair amount of success. I wish the author every success in his adventure of publishing his translation.

7—5—1935 } (Sd. **K. RANGACHARI, M. A., B L.,**
**Prof Maharajahs College,**
**VIZIANAGRAM.**

శ్రీ పరదేవతాయైనమః.

## ఒక చిన్న విజ్ఞప్తి.

---

మానవ ప్రపంచమున నానాటి కెల్ల మార్గముల జ్ఞాన మభివృద్ధి నొందు చుండె ననుటలో సందియ మందవలసినది లేదు. జీవకోటియం దెల్ల విశేష జ్ఞాన మలవఱచుకొను తెలివు గనిపెట్టు శక్తి, భగవాను ననుగ్రహమున మానవునికే గలదు. నిద్రాహారాదులం దావశ్యకమగు సాధారణ జ్ఞానముగాక మంచి చెడ్డలను బరిశీలించు వివేకము గలుగుటయే మానవునియందలి విశేషము. అది సాధారణముగా మానవకోటియందుండి, సంసారసాగరతరణతరణియై, వెలయు చుండుట క్రొత్తగాదు.

ఇఁక వివేకముగల ప్రాణిమాత్రమెల్ల సుఖమునే కోరుచుందురుగదా! అదియుఁ బ్రవాహరూపమున నిత్యమై యవిచ్ఛేదముగ నుండవలయునను నుద్దేశము ప్రాణికోటికెల్ల నుండుననియే నా నిశ్చయము.

అయ్యాది మనోరథసాధకములగు ధనాదులచేఁ గలుగుచుండును. అందును వివేకము చాలనిచో వానివలనఁ గలుగు సుఖముకంటె దుఃఖమే యొక పాలు హెచ్చని నా నమ్మకము.

అట్టి వివేకము గలిగినను తత్సుఖము నిత్యముగాని మానవునికి పూర్ణమనోరథసిద్ధి గలుగ లేదనియే చెప్పవచ్చును.

కావున నిత్యసుఖ, మవశ్యము మానవునకు సంపాదనీయ వస్తు, వనుటకు సందియములేదు. అది యెట్లు గల్గును? ప్రాచీనులగు మనపెద్దలు పెక్కులగు సంసారమార్గములఁ దిరిగి తిరిగి వానిలోఁ గష్టసుఖము లనుభవించి తుదకు, నిత్యసుఖము నొసంగు మార్గ మెయ్యది? యని విచారించి తత్త్వజ్ఞాన సాధక మార్గమే నిత్యసుఖదాయకమని తద్విషయమున బహు గ్రంథముల వ్రాసి వారి జీవితమంతయు దానికై వినియోగించిరనుటలో సందియమొందవలసినదిలేదుగదా!

అట్టి గ్రంథము లసంఖ్యాకములైయుండుట, నివియనియవి, నిన్నియనియు, నెన్నఁజాలను. కాని యివియెల్ల ననితర విజ్ఞేయములై, పండితమాత్రవేద్యమగు సంస్కృతభాషలో నుండుటచేఁ దద్విషయములు ముద్రానిబద్ధ పేటికాంతర్గత సువర్ణభూషణములై, సాధారణులకు సుగ్రాహములుగాకుండెను.

అట్టివి నిత్యసుఖాభిలాషులగు సర్వజనులకును సాధారణముగా సంభవింపఁదగు మార్గమును జేయు మహనీయులుండుట యావశ్యకము కాకపోదుగదా!

ప్రకృతము, బ్రహ్మశ్రీ. పంతుల లక్ష్మీనారాయణశాస్త్రి కాఠకోపనిషదర్థము నాంధ్రీకరించి లోకమున కెంతయు మహోపకృతి యొనర్చిరి.

వీరు నాకు బంధువులును, జిరపరిచితులును నగుటయేగాక, శ్రీ విజయనగర సంస్కృత కళాశాలయందు విద్యాభ్యాసము చేయుతఱిఁ, గొని విషయములలో నపుడపుడు నన్నుఁ దెలిసికొనుచు, గురుసంఘములో నన్నుఁగూడఁ జేర్చుకొనుట వీరి విజ్ఞానము వెలుంగుడును. వీరు తమ "ఆంధ్ర కాఠకోపనిషత్తు" వ్రాసి, నాయొద్ద నామూలాగ్రముగఁ జదివిరి. అందుఁగల యమూల్యవిషయముల నాస్వాదించు నావేశముననో, తత్కవితామృతరసాస్వాదన పారవశ్యముననో లేక యది నిర్దుష్టమై వెలయుటనో, నా కా గ్రంథమున నెచ్చటను నెట్టిదోషములును గానరాలేదు. బాల్యముననే యిట్టి వివేకము గలిగి, మహానుభవముగల వృద్ధపండితులు మాత్రమే చేయవలసిన యిట్టి యసాధారణమగు నుపనిషదాంధ్రీకరణము, నిట్లు నిర్దుష్టముగ వీరు చేయుట, నెంతయు శ్లాఘాపాత్రము లనకతప్పదు. వీరి యీ గ్రంథము సర్వసాధారణవేద్యమైయుండుట, నెల్లవారికిని బరిగ్రాహ్యమగుటయేగాక, విద్యాశాలలందును, గళాశాలలందును విద్యార్థులకు సైతము నవశ్యపఠనీయమగుటలో సందియంపడనక్కఱలేదని నా నిశ్చయము.

ఆకుండి వెంకటశాస్త్రి,

శ్రీ విజయనగర సంస్కృత కళాశాలాప్రధానాంధ్ర పండితుఁడు.

I read with interest the Telugu translation of the Kathakopanishad made by Mr. Pantula Lakshminarayana Sastri. As he is proficient in the Sanskrit and the Telugu languages, there can be no misgiving as his ability for rendering a Sanskrit work into classical Telugu. The Pandit made a new departure in this translation in as much as he included in it the exposition of the text by the famous Sankaracharya. The translation gives one a good conception of the teaching contained in the Upanishad though according to the school of sankara. Such translations alone serve the purpose of enriching the literature in the language while literal ones are worse than their originals and defeat their very object Mr. Lakshminarayana has to be congratulated on making a real contribution to the Telugu literature and earning the gratitude of the Telugu people. I hope the book will enjoy the popularity it deserves

M R. Sanskrit College,
Vizianagram,
10—5—35.

(Sd.) P. V Ramanujaswami. m. a.
Principal.

ఓం శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః.

## నాలుగు మాటలు.

“పగమేశ్వర భక్తి శూన్యమును, దుష్టాచరణాసక్తమును నగు మచ్చిత్తమును శోకమోహాది విషయరాహిత్యముగాఁ జేయుట కేత దుపనిషదర్థజ్ఞాన మావశ్యకమని నేను గుర్తించితిననుటకు మాత్రిమె యీయుపనిషదాంధ్రీకరణము చిహ్నము” అని మాత్రిమె విద్వాంసులు భావింపఁగోరెదను.

ఏతదాంధ్రీకరణము నామోదించు పాఠకులు, శ్రీ విజయ నగరమహారాజ సంస్కృత కళాశాలా పండిత వర్గమునకు మాత్రమె, కృతజ్ఞతఁ జూపుట న్యాయము. నేను వారి బోధనామృతమును గ్రోలిన పిపాసువును. ఇం దేదేని విషయ కుసుమము వికసించుట సత్యమగునే, నది వారి దోహద ప్రభావమే. ఇందలి దోషములు మాత్రము నావి

నేను సంస్కృతకళాశాలయందు విద్యాభ్యాసముఁ గావించు తఱి నేతదుపనిషదర్థమును, మనోరంజకముగా తన్మయత్వముతో బోధించిన, మద్గురువరేణ్యులు (బ్ర. శ్రీ. అప్పల్ల జోగన్నశాస్త్రి) గారికి భక్తియుక్తుఁడనై ప్రణతిశతము లర్పించుచున్నాఁడను. ఈ గ్రంథము నొక్కనెలలో నాంధ్రీకరించుటకు దగు శక్తి నొసంగిన శ్రీరామచంద్రునకు భక్తిసుమాంజలులు.

ఆదరాధిక్యముచేత, గోరంతలగు నిందలిగుణములను కొండంత లుగా వర్ణించి, యమూల్యాభిప్రాయముల నొసంగిన మద్గురువరేణ్య లకును, మత్పోషకులగు, కిళాంబి రంగాచార్యులుగారికిని నా నమ స్కృతములు.

ఏతద్రచనకు నన్నుఁ బ్రోత్సహించిన పు. వెం. స్వామి ప్రభృతులగు భక్తులకు ధన్యవాదములు.

దీని ముద్రణకగు వ్యయము, నాదరపూర్వకముగా భరించిన, శ్రీ జ్ఞానానందాశ్రమమునకును, శ్రీ జ్ఞానానందరామానందులకును గృతజ్ఞతా పూర్వకాభినందనములు.

దీనిని సర్వాంగ సుందరముగ ముద్రించిన శ్రీ రామానుజ విలాస ముద్రణాలయమున కాశీర్వాదములు.

ఇట్లు సర్వజనవిధేయుఁడు :

పంతుల లక్ష్మీనారాయణశాస్త్రి

గజపతినగరము పోష్టు.

1—5—35

శ్రీరస్తు

మాలతీ ! ఓమ్. సరస్వతీ !

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః.

# ఆంధ్ర కార కోప నిషత్తు.



ఓం. సహ నావవతు, సహనౌభునక్తు, సహవీర్యం కరవావహై
తేజస్వి నావధీతమస్తు, మావిద్విషావహై
ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

ఓం. ఉశన్హ వై వాజశ్రవస స్సర్వ వేదసం దదౌ
తస్య హ నచికేతా నామ పుత్ర ఆస ॥౧॥

( ఓం నమో భగవతే, వైవస్వతాయ, మృత్యవే
బ్రహ్మ విద్యాచార్యాయ, నచికేతసేచ ")

[మంజరులు]

ఫలము నభ్యర్థించి వాజశ్రవసుఁడు
* సలిపినాఁడట ; తొల్లి సర్వమేధమ్ము
సర్వస్వ ధనమందొసఁగెవాఁడు, వాని
కిం బుత్రుఁ డఁట నచి కేతోఽభిధుండు.

తగ్ంహ కుమారగ్ం సన్తం దక్షిణాసునీయమానాసు
శ్రద్ధాఽవివేశసోఽమన్యత ॥౨॥

దక్షిణారూప గోదాన ప్రవృత్తిఁ
గని, కుమారుఁ డతండు జన కేష్టకామ
సంప్రయుక్తంబైన శ్రద్ధవహించి
తనలోన నీరీతిఁ దలఁపోయఁ దొడఁగె.

* విశ్వజిద్యాగంబు విరచించెఁ దొల్లి,

పీతోదకా జగ్ధతృణా దుగ్ధదోహా నిరింద్రియాః
అనందానామ తే లోకాస్తాన్సగచ్ఛతి తా దదత్ ॥౩॥

పానీయమును గ్రోలి, పచ్చిక మేసి,
పాలిచ్చిన, నిరిందిర్ యాల, జీర్ణముల,
ఫలరహితముల, గోవుల దాన మొసఁగి
యసుఖలోకావాప్తి నందు, మాతండ్రి.

సహోవాచ పితరం తత కస్మైమాం దాస్యసీతి
ద్వితీయం తృతీయం తగ్ంహోవాచ మృత్యవేత్వాదదామీతి ॥౪॥

అని తదనిష్టంబు హరియింపఁ గోరి
"తండ్రి! నన్నెవనికి దానమిత్తు"వని
యినుమారు ముమ్మారు జనకుఁ బ్రశ్నింపఁ
గినుక నాతఁడు "మృత్యువున కిత్తు" ననియె.

బహూనా మేమి ప్రథమో బహూనా మేమి మధ్యమః
కిగ్ంస్విద్యమస్య కర్తవ్యం యన్మయాఽద్య కరిష్యతి ॥౫॥

* పలువురు ముఖ్యతఁ బ్రిథముండనగుచు
మధ్యమ శిష్యుల మధ్యముఁడనగు
నే నిష్టు యముఁ జేరి యేమి యొనర్తు ?
నేడి నాచేతఁ గావించు నాతండు ?

---

* శిష్యవృత్తి ముఖ్య మధ్యమాధమ భేదముచేఁ ద్రివిధము. ఆచార్యుని యిష్టము నెఱింగి యాతని యాజ్ఞ నొందకయే తదిష్టకార్యము నొనర్చుట. ముఖ్య (ప్రథమ) వృత్తి. గురు నాజ్ఞ నొంది యాచరించునది మధ్యమవృత్తి. గురు నాజ్ఞ నొందియు దాని నాచరింపమి యధమవృత్తి.

ఏ తత్ప్రియోజనా పేక్ష సేయకయె
యలుకచే నీ రీతిఁ బలికె నా యయ్య,
అయిన నట్లగుఁ గాక! యని యతం డనియె
"నేమంటి" ననుచు శోకించు, నప్పితకు

అను పశ్య యథా పూర్వే ప్రతిపశ్య తథాఽపరే
సస్య మివ మర్త్యః పచ్యతే సస్యమివాఽజాయతే పునః ॥౬॥

పూర్వు లే రీతిని బోయిరో తలఁపు
మపర సాధులవృత్త మారసి చూడు
సస్యమ్మువలె వినాశము మర్త్యుఁడొందు
సస్యమట్లనె పునర్జననమ్ముఁ బొందు.

పుత్రునంపెను సత్యమునకు నా యయ్య,
యమ భవనంబున కపు డాతఁ డరిగి
యముఁడు లేమినిఁ ద్రిరాత్రముపవసించె
నాతండురా; నమాత్యాదు లిట్లనిరి.

వైశ్వానరః ప్రవిశత్యతిథి ర్బ్రాహ్మణో గృహాన్
తస్యైతాగ్ం శాంతిం కుర్వంతి హర వైవస్వతోదకమ్ ॥౭॥

వహ్ని తానె యతిథి బ్రాహ్మణుఁడగుచు
నిలుఁ బ్రవేశించు దహించు విధాన
తద్దాహహారి పాద్యాసన రూప
శాంతి సేతురు, కాన సలిలమ్ముఁ దెమ్ము.

ఆశాప్రతీక్షే, సంగతగ్ం, సూనృతాం,
చేష్టాపూర్తే, పుత్ర పశూగ్ంశ్చ, సర్వాన్
ఏతద్వృంక్తే పురుషస్యాల్పమేధసో
యస్యానశ్నన్ వసతి బ్రాహ్మణో గృహే ॥౮॥

ప్రాజ్ఞ నల్పుఁడగు నెవ్వని గృహంబందు
నతిథియభుంజానుఁడై వసియించు

వాని యనిర్జ్ఞాత ప్రాప్త్యభిలాష,
వాని నిర్జ్ఞాతప్రాప్య ప్రతీక్షణము,
వాని సత్సంయోగ భవసూనృతాల,
వాని యాగా...ము భవమైన ఫలము,
వాని పుత్ర పశు సర్వమ్ము హరించు
నన శన రూపమగా నక్కల్లమంబు.

తిస్రో రాత్రీర్యదవాత్సీర్గృహే మేఽనశ్నన్
బ్రహ్మ! న్నతిథి ర్నమస్యః
నమస్తేఽస్తు బ్రహ్మన్ స్వస్తి మేఽస్తు
తస్మాత్ ప్రతి త్రీ న్వరా న్వృణీష్వ ॥౯॥

మృత్యువు :—

బ్రాహ్మణా! యతిథివి ప్రణతి కర్హ్మాడవు
నిరశనంబుగను మున్నిశ లుంటి విచట,
నతిఁ గొమ్ము, శుభమిమ్ము నాకు, నీ రేలు
మూటికిం, గోరుము మూఁడు వరాలు.

శాంత సంకల్ప స్సుమనా యథాస్యా
ద్వీతమన్యు ర్గౌతమో మాఽభి మృత్యో!
త్వత్ప్రసృష్టం మాఽభివదేత్ప్రతీత
ఏతత్త్రయాణాం ప్రథమం వరం వృణే ॥౧౦॥

శమిత సంకల్పుండు, సుమనస్కుఁడగుచు
ననుఁ గూర్చి రుషఁ బాయుతను గౌతముఁడు,
నీ వంప; నెఱిఁగి, న న్నదివించుఁ గాత!
మూఁడింట నియ్యది మొదటి వరంబు.

యథా పురస్తాద్భవితా ప్రతీత ఔద్దాలకిరారుణిర్మత్ప్రసృష్టః
సుఖగ్ం రాత్రీ శ్శయితా, వీతమన్యుస్త్వాందదృశివాన్ మృత్యు
ముఖాత్ప్రముక్తమ్ ॥౧౧॥

మృత్యువు :—

పూర్వమట్లనె స్నేహ పూర్ణమౌ బుద్ధి
నీయందుఁ బ్రీత్యభి జ్ఞాయుక్తి నిలుపు
నౌద్దాలకి యగు నయ్యారుణి యింక
మదనుగ్రహావాప్తి మది నల్క వీఁడి
యమ మందిరాగతు నారసి నిన్ను
రాత్రుల సుఖ వినిద్రలఁ దేలఁ గలఁడు.

స్వర్గే లోకే నభయం కించనాస్తి, నతత్రత్వం, జరయా బిభేతి,
ఉభే తీర్త్వా అశనాయాపిపాసే, శోకాతిగో మోద తే స్వర్గలోకే॥౧౨॥

స్వర్గ్లోకమున రోగ భయమింత లేదు
వెలువఁ డెవ్వఁడు జరా భీతి, లేవందు
నీవు, నాకలి దప్పు లెఱుఁగక దుఃఖ
వర్జితుండయి సుఖింపఁగ వచ్చు నచట.

స త్వ మగ్నిం స్వర్గ్య మధ్యేషి మృత్యో !
ప్రబ్రూహి త్వం శ్రద్ధధా నాయ మహ్యమ్,
స్వర్గ లోకా అమృతత్వం భజన్త
ఏతద్ద్వితీయేన వృణే వరేణ ॥౧౩॥

యజమానులమృతత్వ మందంగఁ జేయు
స్వర్గలోకప్రాప్తి సాధనం బైన
స్వర్గ్యాగ్నిఁ దెలుపుము శ్రద్ధాయుతుండ
నగు నాకు; నిది ద్వితీయంబౌ వరంబు.

ప్రతే బ్రవీమి తదుమే నిబోధ స్వర్గ్య మగ్నిం నచికేతః ప్రజానన్
అనన్త లోకాప్తి, మథో ప్రతిష్ఠాం, విద్ధి త్వ మేతం నిహితం గుహాయామ్॥౧౪॥

మృత్యువు :-

స్వర్గ్యాగ్ని విజ్ఞాన వంతుండ నేను
నీకుఁ దెల్పెదను దాని నెఱింగికొనుము

అద్ది; యనంత లోకాప్తి సాధనము
జగదాశ్రియము, ‡ గుహా సంనివిష్టంబు.

లోకాది మగ్నిం తనువాచ తస్మై
యా ఇష్టకా యావతీర్వా యథా వా
స చాపి తత్ప్రత్యవదద్యథోక్త
మథాఽస్య మృత్యుః పునరేవాహ తుష్టః ॥౧౫॥

భువనాదియగు నగ్ని వివరించి వాని
కె విటియిష్టకలో, యవి యెన్నిరో, యెట్లో ?
తెలుప; నాతఁడు ననూదితముఁ గావించె,
బరితుష్టి, మృత్యువు తిరుగ నిట్లనియె.

త మ బ్రవీత్ ప్రీయ మాణో మహాత్మా,
వరం తవే హాద్య దదామి భూయః,
తవైవ నామ్నా భవితాఽయమగ్నిః,
సృంకాం చేమా మనేక రూపాంగృహాణ ॥౧౬॥

శిష్య యోగ్యత నారసి మహాత్ముఁడనును
ప్రీముదుఁడై, నీకిష్ట వరమిత్తుఁ దిరుగ
నీపేరనే యొక నెగడు నీయ్యగ్ని
చిత్రి స్వరూప నీ † సృంకఁ గైకొనుము.

త్రిణాచికే తస్త్రిభిరేత్య సంధిం, త్రికర్మకృత్తరతి జన్మమృత్యూ,
బ్రహ్మజజ్ఞం, దేవ, మీడ్యం విదిత్వా నిచార్య్యే మాగ్ం
శాంతి మత్యన్త మేతి ॥౧౭॥

మాతృ పితృ గురు సంబంధ త్రియుండు,
యజనాది కర్మ త్రియ విభాసియగు, త్రి
ణాచి కేతుండు జన్మము మృతిం బాసి
సంస్తుత్యుఁడును, బ్రహ్మ జజ్ఞుఁడౌ దేవు

† విద్వాంసులయొక్క బుద్ధియందుండునది.
‡ శబ్దపతియగు రత్నమాల లేక అకుల్పితమగు కర్మగతి.

భావించి, యాత్మభావముచేతఁ గాంచి,
నిజ బుద్ధిఁ దోఁచు శాంతినిఁ బొందు మిగుల.

త్రిణాచికేతస్త్రయమేత ద్విదిత్వా
యఏవం విద్వాంశ్చినుతే నాచికేతమ్
స మృత్యు పాశాన్పురతః ప్రణోద్య
శోకాతిగో మోదతే స్వర్గలోకే ॥౧౮॥

నాచికేతాగ్నిం దిరిణాచికేతుఁడయి
యిత్త్రియం బెఱిఁగి యిట్లెవ్వాఁడు గొలుచు
నకృతాత్ముఁపు మేను సురిక్క క మున్న
యజ్ఞాన కోప రాగాధగ్ను రహితుఁ
డై, స్వర్గమున విరాడాత్మ స్వరూప
మంది, యశోకుఁడై యామోదమొందు.

ఏష తేఽగ్నిర్నచికేతః స్వర్గ్యో
యమవృణీథా ద్వితీయేనవరేణ,
ఏతమగ్నిం తవైవ ప్రవక్ష్యంతి జనాస,
స్తృతీయం వరం నచికేతో! వృణీష్వ ॥౧౯॥

స్వర్గ్య వహ్ని ద్వితీయ వరముగా నన్ను
నడిగి, తపోమోసంగఁ బడిమె నీకిదిగో!
నరులు నీపేరఁ బిల్తురు దీని, మూఁడ
వ వరంబు నచికేత! ప్రార్థింపు మింక.

యేయంప్రేతే మనుష్యేఽస్తీత్యేకే, నాఽయమస్తీతిచైకే,
ఏతద్విద్యా మనుశిష్టస్త్వయాఽహం వరాణామేష వరస్తృతీయః॥౨౦॥

దేహేంద్రియాత్మబుద్ధి వ్యతిరిక్త
మగు నాత్మ, నరుఁడీల్ల నడరునందొరికరు,
అద్ది లేదండొరిక; రది, విచికిత్స,
* యీ విద్యఁ దెలుపు నాకిది తృతీయంబు.

---

* బ్రహ్మవిద్య.

దేవైరత్రాపి విచికిత్సితం పురా,
నహి సుజ్ఞేయ మణురేష ధర్మః,
అన్యం వరం నచికేతో! వృణీష్వ,
మా, మోపరోత్సీరతి మాసృజైనమ్ ॥౨౧॥

మృత్యువు :—

అమరులున్ విచికిత్స నంది రియ్యెడల
సూక్ష్మ మీధర్మ, మసుజ్ఞేయ మగుట
నచికేత! వరము నన్యముఁ గోరు, మివ్వ
రమ్ము వీడు; ముపరోధమ్మొనర్పకుము.

దేవైరత్రాపి విచికిత్సితం కిల,
త్వంచ మృత్యో యన్న సుజ్ఞేయ మాత్థ,
వక్తా చాస్య త్వాదృగన్యో నలభ్యో,
నాఽన్యో వర స్తుల్య ఏతస్య కశ్చిత్ ॥౨౨॥

సురలిందు విచికిత్సఁ జూపుటవలన
నాత్మ తత్త్వము నీవు నజ్ఞేయ మనుట
నిది తెల్ప నీకంటె నితరుండు దొరకఁ,
డిక్కోర్కె కీడు వేఱెద్దియున్ లేదు.

శతాయుషః పుత్ర పౌత్రాన్వృణీష్వ,
బహూన్ పశూన్, హస్తి హిరణ్య, మశ్వాన్
భూమేర్మహదాయతనం, వృణీష్వ
స్వయంచ జీవ శరదో యావ దిచ్ఛసి ॥౨౩॥

శత సమా యుష్కులౌ సుతులఁ, బౌత్రులను,
బహుగ వాదికము, హస్తి హిరణ్యములను,
హయధరా మండలా లడుగుము. బ్రదుకు
మెన్నాళ్లు వలసిన నన్ని వర్షములు.

ఏతత్తుల్యం యది మన్యసేవరం వృణీష్వ విత్తం చిర జీవికాంచ
మహాభూమౌ నచికేత స్త్వమేధి, కామానాంత్వా కామభాజం
కరోమి ॥౨౪॥

ఏతత్సమం బెదూహించిన నడుగు
ధనయుక్త చిర జీవికను గోరుకొనుము,
నృపతివి గమ్ము, నిన్దివ్యాది విషయ
ములఁ గామభాగిగా సలుపుచున్నాను.

యేయే కామా దుర్లభా మర్త్య లోకే
సర్వాన్ కామాగ్ం శ్ఛందతః ప్రార్థయస్వ,
ఇమా రామా స్సరథా, స్సతూర్యా,
న హీ దృశా లంభనీయా మనుష్యైః
ఆభిర్మత్ప్రత్తాభిః పరిచారయస్వ
నచికేతో! మరణం మానుప్రాక్షీః ॥౨౫॥

భూలోకమునయందుఁ బొందంగరాని
సర్వకామముల స్వేచ్ఛగఁ గోరుకొనుము,
రథతూర్యయుతలప్స రగ స్త్రీలు వీరు
లభియింప రిట్టివారలు మనుష్యులకు.

మద్దత్తలైన యిమ్మగువలచేత
గ్రహియింపు స్వపరిచర్యల నచికేత!
ప్రశ్నమ్ము మరణ సంబద్ధమ్ము, నన్నుఁ
గాక దంతపరీక్షగాఁ గోరవలదు.

శ్వోభావా మర్త్యస్య యదంతకైత
త్సర్వేంద్రియాణాం జరయంతి తేజః,
అపిసర్వం జీవిత మల్పమేవ
తవైవ వాహా స్తవ నృత్యగీతే ॥౨౬॥

నచికేతసుఁడు :—

అప్సరాదు లనిత్యమైన భోగములు
సర్వేంద్రియస్థ తేజము హరించునవి,
బ్రహ్మ జీవితము నల్పమ్మె. యాఁ గాన,
నృత్యగీతాదు లీవే యుంచుకొనుము.

న విత్తేన తర్పణీ యో మనుష్యో,
లప్స్యా మహే విత్త మద్రాక్ష్మ చేత్త్వా,
జీవిష్యామో యావదీశిష్యసి త్వం,
వరస్తుమే వరణీయ స్స ఏవ ॥౨౭॥

ధనముచే మనుజుండతర్పణీయుండు,
నినుఁ గాంచుటనె ధనంబును బొందఁగలము
నీ వేలు నందాక జీవింపఁ గలము
మద్వరణీయ మాత్మజ్ఞాన మొకఁడె.

అజీర్యతా మమృతానా ముపేత్య
జీర్య న్మర్త్యః క్వధస్థః ప్రజానన్, (క్వతదాస్థః ప్రజానన్)
అభిధ్యాయన్ వర్ణరతిప్రమోదా
నతిదీర్ఘే జీవితే కోరమేత ? ॥౨౮॥

అజరామృతుల యొద్ద కరిగి, ప్రాప్తవ్య
మెఱుఁగు జీర్యన్మర్త్యుఁ (డవఁడు*క్వధస్థు) (డందే†తదాస్థుఁ)
డై యశాశ్వత హిరణ్యాది భోగమ్ము,
న వివేకి సంప్రార్థ్య మగు దానిఁ గోరు ?.

గీతి ప్రమోదమ్ము, క్రీడాసుఖమ్ము
‡ ననవస్థిత స్వరూపాప్తంబులనుచు
బాగుగా నెఱిఁగిన ప్రాజ్ఞుఁడౌ నెవ్వఁ
డతి దీర్ఘమైన జీవిత మిచ్ఛగించు.

యస్మి న్నిదం విచికిత్సంతి మృత్యో !,
యత్సాంపరాయే మహతి, బ్రూహి నస్తత్,
యోఽయం వరో గూఢ మనుప్రవిష్టో,
నాఽన్యం తస్మా న్నచికేతా వృణీతే,
నాఽన్యం తస్మా న్నచికేతా వృణీతే ॥౨౯॥

ఇతి కాఠకోపనిషది ప్రథమాధ్యాయే ప్రథమావల్లీ
సమాప్తా.

---

* అంతరిక్షాదులకంటె క్రిందిదగు భూమియందున్నవాఁడై.
† స్త్రీపుత్రాదులయం దనురాగము గలవాఁడై.
‡ ఉత్పత్తి స్థితినాశవంతములని.

నరుఁ డీల్గఁగా 'నస్తి నాస్తి' యన్ సంశ
యంబున కాస్పదంబై మహా సాంప
రాయమ్మునందు నిర్ణయమందు నేది,
దుర్వివేచనము నందు నదియే, దట్టి
యాత్మవిజ్ఞానమో యమ! నాకుఁ దెల్పు
నచికేతసుఁడు తదన్యముఁ గోరఁ బోఁడు.
అన్యంబు నచికేతుఁ డర్థింపఁ బోఁడు.

ఇది యాంధ్రి కాఠ కోప నిషత్తునంగల
ప్రథమాధ్యాయ మందలి ప్రథమ వల్లి.



# ఆంధ్ర కఠోపనిషత్తు

## ప్రథమాధ్యాయము — ద్వితీయ వల్లి.

౨

అన్యచ్ఛ్రేయోఽన్యదుతైవ ప్రేయ,
స్తే ఉభే నానార్థే పురుషగ్ం సినీతః,
తయోః శ్రేయ ఆదదానస్య సాధు భవతి,
హీయతేఽర్థాద్య ఉ ప్రేయో వృణీతే ॥౧॥

* శ్రేయమ్ము ప్రేయమ్ము పృథగాత్మకములు,
నానార్థములగుచున్ బంధించుఁ బురుషు ;
శ్రేయమందాశ్రయించిన శుభంబొందవు,
నీ యర్థమును బాయు ప్రేయోవరుండు.

శ్రేయశ్చ ప్రేయశ్చ మనుష్య మేత,
స్తౌ సంపరీత్య వివినక్తి ధీరః,
శ్రేయో హి ధీరోఽభి, ప్రేయసో వృణీతే,
ప్రేయో మందో యోగ క్షేమా ద్వృణీతే ॥౨॥

వ్యామిశ్రమగుచు శ్రేయస్సు, ప్రేయస్సు,
నరుఁ బొంద ; తత్పృథక్కరణంబొనర్చి,
ప్రేయోఽధికంబైన శ్రేయ మర్థించు
గమనించి బుధుఁడు , యోగక్షేమహేతు
వగుట మందుఁడు ప్రేయ మర్థించునందు.

స త్వం ప్రియాన్ ప్రియరూపాగ్ంశ్చ కామా
నభిధ్యాయ న్నచికేతో ! ఽత్యస్రాక్షీః,
నైతాగ్ం సృంకాం విత్తమయీమవాప్తో,
యస్యాం మజ్జంతి బహవో మనుష్యాః ॥3॥

---

* విద్య, అవిద్య.

పుత్రాప్సరో ముఖ్యము లనిత్యములుగ
భావించి నచికేత! వదలినా వీవు
ధనమయం బిక్కట్టి తపథంబుఁ బడయు,
విందె మునింగెద రెందఱో జడులు.

దూరమేతే విపరీతే, విషూచీ,
అవిద్యా, యా, చ విద్యేతి జ్ఞాతా
విద్యాభీప్సినం నచికేతసం మన్యే
నత్వా కామా బహవోఽలోలుపన్త ॥౪॥

తద్జ్ఞ నిర్జ్ఞాత విద్యా, ఽ విద్య, లివ్వి
గతి భిన్నములు, వివేకాఽవివేకాత్మ
కము లౌటను, మహాంతరమున పరస్ప
రమును వ్యావృత్తరూపములు గల్గినవి.
అప్సరగగ ప్రభృతులౌ నట్టి కామములు
బహుళ మయ్యును నిన్ను భజింపలేమి,
నందు, శ్రేయో మార్గుఁడైన విద్యార్థి
గా నిన్ను నచికేత! నే నెంచుచుంటి.

అవిద్యాయా మంతరే వర్తమానాః,
స్వయం ధీరాః, పండితం మన్యమానాః,
దంద్రమ్యమాణాః, పరియంతి మూఢా
అంధేనైవ నీయమానా యథాఽంధాః ॥౫॥

"ప్రజ్ఞాన్వితులము, శాస్త్రప్రవీణులము
మేము", మంచుఁ దలఁచు వారై మూఢులైన
జను లవిద్యాంతరంబునఁ జరించుచును,
గడు కుటిలం, బనేక ప్రకారకము,
నగు గతిం గాంచు వారై, జరామరణ
రోగాది దుఃఖముల్ గాంచు * భ్రమింతు

---

* ఈ భ్రమణము స్వకృత పుణ్యపాపకర్మముల ననుసరించి సమస్తలోకములందును సంభవించునది.

రంధుండై, విషమ వర్త్మంబు దోఁడి తేరఁ,
జనెడు నంధు లనర్థమును బొందునట్లు.

న సాంపరాయః ప్రతి భాతి బాలం,
ప్రమాద్యంతం, విత్తమోహేన మూఢమ్,
"అయం లోకో, నాస్తి పర", ఇతి మానీ
పునః పున ర్వశమాపద్యతే మే ॥౬॥

స్త్రీ పుత్రి సంసక్తిఁ జెందినవాఁడు,
విత్త నిమిత్తాఽవివేక మూఢాత్ముఁ,
డవివేకి, * పరభువ నాప్తి ప్రయోజ
నమగు సాధనవిశేషముఁ బొందలేఁడు.

"దృశ్యమానంబగు నీ లోక మొకఁడె
గల, దదృష్ట పరలోకంబులే"వనెడు
మనన శీలుఁడు పునః పున రుద్భవముల
నందుచు, మృత్యువు నగు నాకుఁ జిక్కు.

శ్రవణాయాపి బహుభిర్యోనలభ్యః,
శృణ్వంతోఽపి బహవో యం న విద్యుః,
ఆశ్చర్యో వక్తా, కుశలోఽస్య లబ్ధా,
ఽఽశ్చర్యో జ్ఞాతా కుశలానుశిష్టః ॥౭॥

విన నలభ్యుఁ డనేక జనుల కియ్యాత్మ,
వినియుఁ బల్లుండ్రు వీని నెఱుంగ లేరు,
పెక్కండ్రిఁ దద్వక్త యొక్కఁ డాశ్చర్యుఁ
డై గల్గు, త న్నిపుణాత్ముఁడౌ లబ్ధ

---

* శరీరపాతమైన పిదపఁ బొందఁబడునది, పరలోకము. అట్టి పరలోక ప్రాప్తియే ప్రయోజనముఁగాగల శాస్త్రీయమగు ఓంకార ధ్యానాదిరూపమగు సాధనవిశేషము సాంపరాయము.

యును, తత్ప్రవీణ గురూపదిష్టుఁడగు
జాతయు, నట్ల యాశ్చర్యులై యుందురి.

నవరేణా వరేణ ప్రోక్త ఏష సువిజ్ఞేయో బహుధా చింత్యమానః
అనన్యప్రోక్తే గతి రత్ర నాస్త్యణీయా న్హ్యతర్క్య మణుప్రమాణాత్
॥౮॥

"కలఁడు, లేఁడు, ప్రపంచ కర్త, యకర్త,
శుద్ధుఁ, డశుద్ధుఁ" డంచును చింత్యమానుఁ
డయిన యతఁ డల్పోక్తుఁడ యాత్మ; విజ్ఞేయుఁ
డగునె లెస్సగ హీనుఁ డగు మానవునకు?.

ఆత్మసాక్షాత్కారుఁడగు గురుం డెఱుఁగఁ
జేయ * తద్గత భేద చింత తొలంగుఁ,
గాదేని నణువున కన్న నణీయుఁ
డయినట్టి యితఁడు (ఆత్మ) తర్కాగోచరుండు.

నైషా తర్కేణ మతి రాపనేయా,
ప్రోక్తాఽన్యేనైవ సుజ్ఞానాయ ప్రేష్ఠ!,
యాం త్వ మాపః సత్యధృతి ర్బతాసి
త్వాదృ జ్నో భూయా న్నచికేతః! ప్రష్టా ॥౯॥

† అని తరప్రోక్తాత్మమునఁ గల్గు నాగ
మ ప్రతిపాద్యాత్మ మతి తర్కమునను
నాపనేయము, తార్కికా న్య గురూక్త
మౌనేని ప్రియుఁడ! (ప్రేష్ఠ!) విజ్ఞానంబుఁ బడయు.

మద్వరదానసంభవము నద్దానిఁ
బడసితి వీవు, పాపము! సత్యధృతివి!

* ఆత్మవిషయకమయిన అస్త్యాదివికల్పవిచారము.

† ఆత్మకంటె నభిన్నుఁడనను జ్ఞానముగల యాచార్యునిచేఁ జెప్పఁబడిన యాత్మవిషయమున.

నచికేత ! త్వత్సమానప్రష్ట శిష్యుఁ (పుత్రుఁ)
డయ్యెడుఁ గాత ! మా, కనుట్యందు మజుల.

జానా మ్యహగ్ం శేవధి రిత్య నిత్యం,
నహ్యధ్రువైః ప్రాప్యతే హిధ్రువం తత్,
తతో మయా నాచికేత శ్చితోఽగ్ని,
రనిత్యైర్ద్రవ్యైః ప్రాప్తవా నస్మి నిత్యమ్ ॥౧౦॥

నిత్యంబుగాని దానిగకర్మఫలము
నే నెఱుంగుదు, నాత్మ నిత్య, మనిత్య
మగు ద్రవ్యములఁ జిక్క, దైనఁ బళావుకు
లర్పించి, నాచికేతాగ్ని సేవించి,
సాపేక్ష నిత్యమా స్వర్గాఖ్యమైన,
యామ్యపదంబుఁ నే నందియున్నాఁడ.

కామస్యాప్తిం, జగతః ప్రతిష్ఠాం,
క్రతో రనన్త్య, మభయస్య పారమ్,
స్తోమ మహ, దురుగాయం, ప్రతిష్ఠాం
దృష్ట్వా ధృత్యా ధీరో నచికేతోఽత్యస్రాక్షీః ॥౧౧॥

అభయపారమ్ము, కామాప్తి, లోకాశ్ర
యమ్ము, బ్రహ్మోపాసనానన్త్యఫలము,
నణిమాదియుతము, స్తుత్య, మురుగాయమ్ము
నాత్మస్థితిఁగని, యఃయ్యఖిల భోగముల
ధృతి నచికేత వీఁడితివి ధీరుఁడవు!.

తం దుర్దర్శం, గూఢ మనుప్రవిష్టం,
గుహాహితం, గహ్వరేష్ఠం, పురాణమ్,
అధ్యాత్మ యోగాధిగమేన దేవం
మత్వా, ధీరో హర్ష శోకౌ జహాతి ॥౧౨॥

* గహనప్రవిష్టుని, 1 గహ్వారస్థితుని,
2 బుద్ధిస్థు, 3 దుర్దర్శుం, బూర్వు, నయాత్ము
* నధ్యాత్మ యోగ సంప్రాప్తి నెఱింగి
కడచును హర్ష శోకముల ధీరుండు.

ఏతచ్ఛ్రుత్వా, సంపరిగృహ్యామర్త్యః,
ప్రవృహ్య ధర్మ్య, మణు మేతమాప్య,
స మోదతే మోదనీయం హి లబ్ధ్వా,
వివృతగ్ం సద్మ నచికేతసం మన్యే ॥౧౩॥

ఇది యాలకించి, గ్రహించి, మర్త్యుండు
తనువునందుండి వేఱొనరించి, ధర్మ్య
మై, సూక్ష్మమగు నాత్మ నంది, యాతండు
హర్షణీయాత్మ సంప్రాప్తి రంజిల్లు
బ్రహ్మలోకము నీకు ద్వారముం దెఱచు
నని నచికేత! నా మనమందు నెంతు.

అన్యత్రధర్మా, దన్యత్రా ధర్మా,
దన్యత్రాస్మాత్ కృతాకృతాత్,
అన్యత్ర భూతాచ్చ, భవ్యాచ్చ,
యత్త త్పశ్యతి తద్వద ॥౧౪॥

నచికేతుఁడు :—

ధర్మంబుకన్న, నధర్మంబుకన్న,
కారణంబునకన్న, కార్యంబుకన్న,

---

* ప్రకృతి సంబంధములగు నగర వాద్యాది విషయ వికార విజ్ఞానముచే నాచ్ఛాదింపఁబడినవానివలెనున్నవాఁడు, 1 రాగద్వేషాదులగు ననర్థ పరంపరలచే బహుశ్రాయాసజనకమగు శరీరమందున్నవాఁడు, 2 బుద్ధియందు లభించుటచే బుద్ధిస్థుఁడని చెప్పఁబడెనుగాని బుద్ధియందుండుటచేఁ గాదు, 3 అధిక ప్రయత్నముచేఁ దెలియంబడువాఁడు.

* విషయములనుండి మరలించి మనస్సు నాత్మయందుంచుట అధ్యాత్మ యోగము.

భూతభవ్యాదికంబున కన్న. వేఱు
గా నెద్దిగంటివి, వదానిం దెలుపుము.

సర్వే వేదా యత్పద మామనంతి,
తపాగ్ంసి సర్వాణిచ యద్వదంతి,
యదిచ్ఛంతో బ్రహ్మ చర్యం చరంతి,
తత్తేపదగ్ం సంగ్రహేణ బ్రవీ'మ్యో'మిత్యే తత్ ॥౧౫॥

యముఁడు :—

గమనీయ మెద్ది వేదములెల్లఁ దెలుపు ?
తపములన్నియును నెద్దానిఁ బొందించు ?
య దభీప్స బ్రహ్మచర్య మ్మొనర్చెదరు ?
వాక్రుత్తు నోం (ఓం) శబ్దవాచ్య మైనట్టి
యప్పదమ్మును సంగ్రహంబుగా నీకు.

ఏత ద్ధ్యే వాక్షరం బ్రహ్మ ఏత ద్ధ్యే వాక్షరం పరమ్,
ఏత ద్ధ్యే వాక్షరం జ్ఞాత్వాయోయదిచ్ఛతి తస్యతత్ ॥౧౬॥

ఇయ్యక్షరమె బ్రహ్మ, యియ్యక్షరంబె
పరమును, నేతదక్షరము నే యెఱిఁగి
బ్రహ్మమటంచు నుపాసించి యెవ్వఁ
డెది కోరు నవ్వాని కది లభ్యమగును.

ఏతదాలంబనగ్ం శ్రేష్ఠ మేత దాలంబనం పరమ్,
ఏ తదాలంబనం జ్ఞాత్వాయోయదిచ్ఛతి తస్య తత్ ॥౧౭॥

అతి ప్రశస్యంబె త దాలంబనంబు
అపరముం, బర, మే త దాలంబనంబు
ఏ త దాలంబనం బెఱిఁగి, పరాప
రములం దుపాస్యుఁడౌ బ్రహ్మంబు భాతి.

నజా యతే మ్రియతే వావిపశ్చి,
న్నాఽయం కుతశ్చి, న్నబభూవ కశ్చిత్
అజో నిత్య శ్శాశ్వతోఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే ॥౧౮॥

జనన మందఁడు, మృతిం గనఁడు, మేధావి,
కారణాంతరమునం గలుగ లేదితఁడు,
స్వాత్మంబునుండి యర్థాంతర భూత,
మైనట్టి దెద్దియున్ లేనట్టివాఁడు,
నజుఁడు, నిత్యుండు, నియ్యాత్మ శాశ్వతుఁడు,
కానఁ బురాణుఁ డక్కతన శస్త్రాది
హన్య మానశరీరుఁ డయ్యు, నాకసము
వడువున హింసింపఁబడువాఁడుగాడు.

హన్తాచే న్మన్యతే హంతుగ్ం,
హత శ్చే న్మన్యతే హతమ్,
ఉభౌ తౌ నవిజానీ తో
నాఽయగ్ం హంతి, నహన్యతే ॥౧౯॥

కాయమాత్రము నాత్మగాఁ జూచునట్టి
హంత 'చంపితి'నంచు హతుఁ'డీల్గితి'నని
యెంచు. స్వాత్మ నెఱుంగరీయిరువ్వు, రాత్మ
యది యవికారి చంపదు, చంపఁబడదు.

అణోరణీయాన్, మహతో మహీయా
నాత్మాఽస్య జంతో ర్నిహితో గుహాయాం,
త మక్రతుః పశ్యతి వీతశోకో
ధాతు ప్రసాదా న్మహిమాన మాత్మనః ॥౨౦॥

ఆత్మ నినిరుక్తమగున దసత్తు
సూక్ష్మంబుకంటెను సూక్ష్మతరుండు
ధాత్రికంటెను మహత్తరుఁ డాత్మ, యాతఁ
డేత ద్ద్వివిధజాతు హృదయస్థితుండు
విషయోపరతబుద్ధి, విగత కాముండు
వానిఁ గన్గొను, మనగ ప్రభృతీంద్రియమ్ము

లంత ప్రసన్నంబులగు ; దాన నాత్మ
మహిమంబుఁ గని. శోక రహితుఁడై యుండు.

ఆసీ నోదూరంవ్రజతి, శయానో యాతి సర్వతః,
కస్తం మదామదం దేవం మదన్యో జ్ఞాతుమర్హతి ॥౨౧॥

ఆసీనుఁడై దూర మరుగు శయానుఁ
డై నల్దెసల కేగు నమదు, సానందుఁ,
దద్దేవుని విరుద్ధ ధర్ముఁ, బండితుఁడ
నైన నేఁ గాకెవ్వఁ డన్యుం డెఱుంగు ?

అశరీ రగ్ం, శరీరేష్వ నవస్థేష్వవస్థితమ్,
మహాంతం, విభు, మాత్మానం మత్వాధీరో నశోచతి ॥౨౨॥

అశరీరునిగ, ననిత్య శరీర సంస్థి
తునిగ, వికారహీనునిగ, నిత్యునిగ,
ఘనతరునిగ, వ్యాపిగను, నాత్మఁ దలఁచి
వ్యధఁ బాయు ధీమంతుఁ డయమహాత్ముంచు.

నాయమాత్మా ప్రవచనేన లభ్యో,
న మేధయా, న బహునా శ్రుతేన,
య మేవైష వృణుతే తేన లభ్య,
స్తస్యైష ఆత్మా వివృణుతే తనూగ్ం స్వామ్ ॥౨౩॥

వేదంబులను వల్లె వేయుటవలన,
బహుళ పాండిత్యంబువలన, గ్రంథార్థ
ధారణా శక్తి యుక్తంబగు మేధ
వలనను, జిక్కఁడువాఁడుగాఁ డాత్మ.

సాధకుండగు వీఁడు స్వాత్మ నెవ్వాని
నర్థించు వానికే యాత్మ లభించు
నయ్యాత్మ కాముని కయ్యాత్మ పార
మార్థికంబగు స్వయాథాత్మ్యంబొసంగు.

నాఽవిరతో దుశ్చరితాన్నాఽశాంతో నాఽసమాహితః,
నాఽశాంతమానసో వాఽపి ప్రజ్ఞానేనైన మాప్నుయాత్ ॥౨౪॥

పాపకర్మంబును బాసినవాఁడు,
నింద్రియాసక్తిం ద్యజించినవాఁడు,
* నన సమాహితుఁడు, నవ్యాపృతాత్ముండు
ప్రజ్ఞానమున నాత్మఁ బడయంగ వలయు.

యస్య బ్రహ్మచక్షత్రంచ ఉభేభవత ఓదనః।
మృత్యుర్య స్యోపసేచనంక ఇత్థా వేద యత్రసః? ॥౨౫॥

క ఇత్థా వేద యత్రసః॥

ఇతి కాఠకోప నిషది ప్రథమాధ్యాయే
ద్వితీయా వల్లీ సమాప్తా.

ఉ ప్రాకృత బుద్ధియగా నరుఁడు బ్రహ్మము క్షత్రము రెండు భుక్తియై
యాశలిఁ దీర్ప, సర్వహరుఁడయ్యును మృత్యువు భోజనంబుగా
లేక, ఘృతంబు శాకమగురీతిని భోజన సాధనంబుగాఁ,
జేకొను నాత్మ, యెచ్చట వసించునో సాధకునకెట్లుఁగునే ?

ఇది యాంధ్ర కాఠ కోప నిషత్తునం గల
ప్రథమాధ్యాయమందలి ద్వితీయవల్లి.

---

* సమాహితమగు మనస్సుగలవాఁడు.

# ఆంధ్ర కాఠ కోప నిషత్తు

## తృతీయాధ్యాయము — తృతీయ వల్లి.

### 3

ఋతం పిబంతౌ సుకృతస్య, లోకే
గుహాం ప్రవిష్టౌ పరమే పరార్థే (ర్ధ్యే),
ఛాయాతపౌ, బ్రహ్మవిదో వదంతి
పంచాగ్నయో, యే చ త్రిణాచికేతాః ॥౧॥

సీ. స్వకృత కర్మఫలాను భవముఁ
. బొందుచును, ఛ, త్రిన్యాయమునను, వర్తిల్లువార,
లధిక శ్రేష్ఠంబైన యట్టి బ్రహ్మస్థాన
మగుచు శరీరమం దడరుచున్న
యట్టి బుధ్ధ్యాఖ్యగుహాంబ్రవిష్టులగు,
జీవాత్మ లిర్వురును, ఛాయాతపముల
చందనంబునను విలక్షణులు,
సంసారిత్వమున నసంసారిత్వమునను నగుదు,
ఆ. రంచు బ్రహ్మవేత్తలందు, రకడ్మలౌ
వారె గాక యిట్లు పలుకుచుండు
వారు గలరు మఱియు * పంచాగ్నులు, గృహస్థు
లై, త్రిణాచికేతులైనవారు.

యః సేతు రీజానానా, మక్షరం బ్రహ్మ యత్పరమ్
అభయం తితీర్షతాం పారం నాచికేతగ్ం శకేమహి ॥౨॥

---

* గార్హ్యపత్య, ఆహవనీయ, దక్షిణాగ్ని, సభ్య, ఆవసథ్యములను నైదగ్నుల నారాధించువారు పంచాగ్నులు.

మ. భయశూన్యస్థితిచే భవాంతముఁ దరింపం జూచు విజ్ఞాని కా
శ్రియభూతంబయి, యక్షరంబగు పరబ్రహ్మంబు గుర్తించు వి
ద్యయు, 1నీజానుల యార్తిఁబాపు నచికేతోఽగ్నిం 2బ్రవర్తించు శ
క్తియు మాకున్నది. బ్రహ్మ కర్మ విదు లర్థింపందగున్ వీనినిన్.

అత్మానగ్ం రథినం విద్ధి, శరీరగ్ం రథమేవతు,
బుద్ధింతు సారథిం విద్ధి, మనః ప్రగ్రహ మేవచ ॥3॥
ఇంద్రియాణి హయా నాహు, ర్విషయాగ్ం స్తేషు గోచరాన్,
ఆత్మేంద్రియ మనో యుక్తం 'భో' క్తేత్యాహు ర్మనీషిణః ॥४॥
యస్త్వ విజ్ఞానవాన్ భవ త్యయుక్తేన మనసా సదా,
తస్యేంద్రియాణ్యవశ్యాని, దుష్టాశ్వా ఇవ సారథేః ॥౫॥

సీ. అందు సంసారియౌ నాత్మరథస్వామి,
రథము దేహంబు, సారథియె బుద్ధి
పగ్గమ్ము హృదయ, మశ్వమ్ములు
చక్షురాదికములైనట్టి యింద్రియములెల్ల,
తద్గోచరములగు దారులు రూపాది
కమ్ములై తగు విషయమ్ము, లెఱుఁగు
మిట్లు, మనశ్శరీరేంద్రియయుతు నాత్మఁ
బాడితుల్ భోక్తగాఁ బలుకుచుండు,
గీ. రందు సత * మ సమాహిత స్వాంతయుక్తుఁ
డగు నవిజ్ఞానవంతున కగునె యింద్రి
యములు వశ్యము? లనిపుణుండైన యితర
సారథిక దాంతహయముల చందమునను.

యస్తు విజ్ఞానవాన్ భవతి యుక్తేన మనసా సదా,
తస్యేంద్రియాణి వశ్యాని సదశ్వా ఇవ సారథేః ॥౬॥

గీ. సంతతమును సమాహిత స్వాంత మూను
వాఁడు విజ్ఞానవంతుఁ, ‡ డెవ్వాఁడు కలఁడొ,

1 యజమానుల
2 ఈప్రవర్తనము గ్రహణరూపమును, చయనరూపమును నగునట్టిది.
* ఏకాగ్రతలేని మనస్సుఁ గలవాఁడు.
‡ బుద్ధియను సారథి.

యాతనికి నింద్రియములు వశ్యమ్ము లితర
సారథికి సదశ్వంబుల చందమునను.

యస్త్వ విజ్ఞానవాన్ భవ, త్యమనస్కః, స్సదాఽశుచిః,
న స తత్పద మాప్నోతి, సగ్ం సారం చాధిగచ్ఛతి ॥౭॥

గీ. ఎవఁ డవిజ్ఞానవంతుఁడై, యెపుడు నశుచి
యగునో, యసమాహిత మనస్కుఁ డతఁడు, పరమ
పదముఁ బడయఁ డాసారథివలన, మఱియు
జనన మరణ లక్షణము సంసార మొందు.

యస్తు విజ్ఞానవాన్ భవతి సమనస్కః స్సదా శుచిః
స తు తత్పద మాప్నోతి యస్మా ద్భూయో న జాయతే ॥౮॥

గీ॥ ఎవఁడు విజ్ఞానవంతుఁడై యెసఁగుచును, స
మాహిత మనస్కుఁడై, శుచి యగునో, యతఁడు
తిరుగ నందుండి జన్మంబుఁ బొరయఁడేని
యట్టి యక్షరంబగు పదంబందువాఁడు.

విజ్ఞాన సారథి ర్యస్తు మనః ప్రగ్రహవాన్ నరః
సోఽధ్వనః పార మాప్నోతి తద్విష్ణోః పరమం పదమ్ ॥౯॥

మ. హృదయ ప్రహవంతుఁడున్, శుచియునై, యేపారి విజ్ఞాన సా
రథి విద్యాంసుఁడునై రహించు నెవఁడా ప్రాజ్ఞుండు సంసారమున్
పదవిన్ మీఱు పరంబు *బొందు నధిగంతవ్యంబు, నుత్కృష్టమా
నదియే విష్ణుపదంబు దానిఁ గొని పాయంగల్గు సంసారమున్॥

ఇంద్రియేభ్యః పరాహ్యర్థా, అర్థే భ్యశ్చ పరం మనః
మనసశ్చ పరాబుద్ధి, ర్బుద్ధేరాత్మా మహాన్ పరః ॥౧౦॥

సీ. శబ్దరూపరసాది సకలార్థములు
నింద్రియంబులకంటె బరంబులయిన,
వయ్యర్థములకంటె నగుఁ బరంబగుచు సం
కల్ప వికల్పాత్మకంబు మనము

---

* ఇచట "పొందు" అనునది యౌపచారికము. అజ్ఞానావరణ వినాశమే యాత్మ ప్రాప్తియని యెఱుంగునది.

అమ్మనంబునకంటె నధ్యవ సాయాత్మ
కంబైన బుద్ధి పరంబయినది,
యబ్బుద్ధి కన్న నవ్యక్తంబునందుండి
ప్రథమ జాతమగు హైరణ్యగర్భ

గీ. నామకాత్మ పరంబయినది యగుం, బ
రమ్మనంగ నర్థమ్ము సూక్ష్మమ్ము, ప్రత్య
గాత్మ భూతమ్ము, మఱియు మహత్తరమ్ము,
నగును. గానఁ బరంబు లిట్లగుని వెల్ల.

మహతః పరమవ్యక్త, మవ్యక్తాత్ పురుషః పరః,
పురుషా న్నపరం కించి, త్సా కాష్ఠా సా పరాగతిః ॥౧౧॥

ఆ. అమ్మహత్తుకంటె నవ్యక్తము పరంబు.
పరుఁడు దానికంటెఁ బురుషుఁ, డట్టి
పురుషుకంటె నొండు పరము లేమిని, పరా
కాష్ఠ యది ప్రకృష్ట గతియు నదియ.

ఏష సర్వేషు భూతేషు గూఢోఽఽత్మా న ప్రకాశతే,
దృశ్యతే త్వగ్రియాబుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః ॥౧౨॥

సీ. బ్రహ్మాద్యమై స్తంబపర్యంతమగు సర్వ
భూతంబులను గూఢముగ వసించు
వాఁడయి శ్రవణాది బహుకర్మయుతుఁ, డవి
ద్యామాయ నాచ్ఛన్ను డగుటవలన
నియ్యాత్మ మెవ్వానికే నాత్మగా ప్రకా
శింపఁ డిదెంత విచిత్రమైన !
దహహా ! తన్మాయ యత్యంత గంభీరమై
నట్టిది, దురవగాహ్యంబునగును,
ఏమి యాశ్చర్యమోగాని యెల్లప్రాణి
లోకమును బరమార్థ స్వరూపమయ్యు

వాస్తవంబుగ, బోధింపఁ బడియు నకట!
'యేనె పరమాత్మ'నని గ్రహియింపలేదు.

ఆ. ఘటపటాదులట్లు గాన్పించు దేహాదు
లాత్మయంచు 'వెంకనార్య' సుతుఁడ
నేనటంచు నెంచు నెఱిఁగింపకయె, యాత్మ
మాయజగము మోహమగ్నమయ్యె.

గీ. అట్టులయ్యును నేకాగ్రి తాన్వితంబు,
సూక్ష్మవస్తు నిరూపణ శోభితంబు,
నగుచు సంస్కృతమగు, బుద్ధి నరసి సూక్ష్మ
దర్శులగు పండితులు చూడఁ దగుదు రతని.

యచ్ఛేద్వాఙ్మనసీప్రాజ్ఞ, స్తద్యచ్ఛే జ్జ్ఞాన ఆత్మని,
జ్ఞాన మాత్మని మహతి నియచ్ఛే, త్తద్యచ్ఛే చ్ఛాన్త ఆత్మని ॥౧౩॥

ఆ॥ ఎల్ల యింద్రియముల నుల్లమందును, స్వాంత
మును ప్రకాశరూప బుద్ధియందు
బుద్ధిఁ బ్రథమ జాత్మ నద్దాని శాంతాత్మ
లయము సేయవలయు ప్రాజ్ఞజనుఁడు.

ఉత్తిష్ఠత! జాగ్రత! ప్రాప్య, వరా న్నిబోధత !!
క్షురస్యధారా నిశితా దురత్యయా
దుర్గం పథస్త త్కవయో వదంతి ॥౧౪॥

సీ. ఆదిలేని యవిద్య యందు నిద్రించుచు
న్నట్టి మీరలు ప్రాణులార! లెండు!
ఆత్మాభిముఖులుకం డతి ఘోరరూపమ
నర్థ బీజంబును నైన యట్టి
యజ్ఞానమను నిద్రయందుండి మేల్కొండు!!
స్వాత్మానుభవముఁ గలట్టి గురులఁ

జేరి, వార లుపదేశించు సర్వాంతరుఁ
డగు నాత్మ 'నయమహామస్మి'యాచుఁ

గీ. దెలిసికొండు !! వాఁడియగు కత్తి మొన యెట్లు
పాదములఁ బొందుటకు దుర్లభంబో యట్ల
యాత్మ తత్త్వమార్గంబు నత్యంత దుర్గ
మంబుగాఁ దెల్పు మేధావి మండలంబు.

అశబ్ద, మస్పర్శ, మరూప, మవ్యయం,
తథాఽరసం, నిత్య, మగంధవచ్చ, యత్
అనాద్యనంతం, మహతః పరం, ధ్రువం
నిచాయ్య తన్మృత్యుముఖాత్ ప్రముచ్యతే ॥౧౫॥

ఆ. * అవ్యయంబు, 1 బరూప, 2 మస్పర్శము, 3 నశబ్ద,
4 మట్లరస, 5 మగంధ, మఱి 6 యనాద్య
నంత, నిత్యమగు 7 మహత్పరాత్మ ధ్రువంబు
గా నెఱింగ మృత్యుగతుఁడు గాఁడు

నాచికేత ముపాఖ్యానం మృత్యుప్రోక్తగ్ం సనాతనమ్
ఉక్త్వా. శ్రుత్వా చ మేధావీ బ్రహ్మలోకే మహీయతే ॥౧౬॥

క. వైవస్వతో పదిష్టము
లౌ వల్లులఁ దగి పురాణ మగు నిన్నచికే
తోఽవాప్త ముపాఖ్యానముఁ
దావిని తెల్పియును, బ్రహ్మధామముఁ జేరున్.

---

* వ్యేతి=క్షీయత ఇతి వ్యయం. నవ్యయం అవ్యయమ్=నిత్యమైనదని భావము. 1 రూపము లేనిది; 2 స్పర్శము లేనిది; 3 శబ్దరహితము; 4 రసముగానిది; 6 కారణము లేనిదియు, కార్యభూతమగు వస్త్వంతరము వేఱొకటి లేనిదియు; 7 బుద్ధి కంటె వేఱైనది.

య ఇమం పరమం గుహ్యం శ్రావయేద్బ్రహ్మసంసది
ప్రయతః శ్రాద్ధకాలేవా తదానన్త్యాయకల్పతే
తదానన్త్యాయకల్పతే ॥౧౭॥

ఇతి కాఠకోపనిషది ప్రథమాధ్యాయే
తృతీయావల్లీ సమాప్తా.

గీ. నరుఁడు శ్రేష్ఠమై గుహ్యమై పరగు దీని
బ్రహ్మసభఁగాని శ్రాద్ధకాలమునఁగాని
కడు శుచిగ నుండి వినిపించు నెడల నది
అనంతఫలము నీయంగ సమర్థమగు, న
నంతఫలము నీయంగ సమర్థమగును.

ఇది యాంధ్రి కాఠకోపనిషత్తునంగల
ప్రథమాధ్యాయమందలి తృతీయవల్లి.

———

# ఆంధ్రీకార కోప నిషత్తు

## ద్వితీయాధ్యాయము — ప్రథమ వల్లి.

౪

పరాఞ్చి ఖానివ్యతృణత్ స్వయం భూ,
స్తస్మాత్ పరాఙ్ పశ్యతి నాఽన్తరాత్మన్;
కశ్చిద్ధీరః ప్రత్యగాత్మాన మైక్ష
దావృత్తచక్షు రమృతత్వ మిచ్ఛన్ ॥౧॥

సీ. అస్వతంతుఁడు కాని యస్వరమేశుండు
చక్షురాదుల బాహ్యసంగతంబు
లయి శబ్దరూప ముఖ్యార్థప్రకాశనా
ర్థములుగా హింసఁ బొందఁగఁ జేసె
నవియు, పరాక్ స్వరూపాఽనాత్మభూత శ
బ్దాదులఁ గను, నంతరాత్మఁగనవు,
ఈ విధి లోకస్వభావముండఁగ, నీటి
కెదు రీదు గతి ధీరుఁ డెవఁడొ యొకఁడు,

గీ. విషయజాలంబునుండి వ్యావృత్తమైన
చక్షురాదులౌ నింద్రియ జాతముం గ
లట్టివాఁడగుచుం, బ్రత్యగాత్మఁ గాంచు,
నాత్మ కమరణ ధర్మత్వ మభిలషించి.

పరాచః కామా ననుయంతిబాలా,
స్తే మృత్యో ర్యంతి వితతస్య పాశమ్,
అథ ధీరా అమృతత్వం విదిత్వా,
ధ్రువ మధ్రువే ష్విహ నప్రార్థయంతే ॥౨॥

సీ. ఆత్మదర్శనము సేయుంగ నీ యదవిద్య,
తదుపదర్శితభోగతతిని తృష్ణ

యగు, న విద్యా తృష్ణ లవియాత్మదర్శన
ప్రతిబంధకములౌట, బాలుగెల్ల
బాహ్యకామములఁ బ్రవర్తింతు, రద్దాన
వారెల్ల నెల్లెడ వ్యాప్తమైన
మృత్యుపాశములఁ బ్రాపింతు; రక్కతనధీ
రులు ప్రత్యగాత్మ స్వరూపమందు
గీ. నునికియే లక్షణమగు, ముక్తిని ధ్రువంబు
గా నెఱింగి, పదార్థ సంతాన మధ్రు
వంబనుచు దానిఁ గోరరు, ప్రత్యగాత్మ
దర్శన ప్రతికూలమన్ తలఁపువలన.

యేన రూపం, రసం, గంధం,
శబ్దాన్, స్పర్శాంశ్చ, మైథునాన్
ఏతే నైవ విజానాతి
కిమత్రపరిశిష్యతే ఏతద్వైతత్ ॥3॥

సీ. సర్వలోకమ్మును శబ్దరూప రసగం
ధస్పర్శముల మైథునముల సరిగ
నెఱుఁగును విజ్ఞాన, మేస్వభావమయి దే
హాది భిన్నమగు నియ్యాత్మవలన,
"దేహాది భిన్నాత్మఁ దెలియుదు"నదు,
"దేహాదిసంచయుఁడ నే నరయుదు"నను,
నీలోక, మిది తగునే? శరీరాది సం
తతికి జ్ఞాతృత్వమ్ముఁ దడవఁ దగునె
గీ. కాన శబ్దాదులెల్ల, లోకంబు దీని
చేతన యెఱుంగుఁ దా; నవిజ్ఞేయమైన
దాత్మ కెద్దియే నీ జగంబందుఁ గలదె?
యాత్మసర్వజ్ఞుఁడడిగితీ, వది యితండె.

స్వప్నాంతం జాగరితాంతం చోభౌయేనానుపశ్యతి,
మహాంతం, విభు, మాత్మానం మత్వా ధీరో నశోచతి ॥4॥

మ. జనముల్ మేల్కొనుచో గ్రహింపఁదగుచున్, స్వప్నంబులోనున్న వే
ళ నెఱుంగందగుచున్న *యర్థముల నెల్లన్ వేనిచేఁ గాంతు; రా
తని సర్వస్థలసంగతుం డనుచు, మహాత్మాన్వితుఁడంచున్ గ్రహిం
చిన ధీరుం "డతఁ డేన" యంచు వగపుం జెందం డతం డీతఁడే.

య ఇమం మధ్వదం వేద ఆత్మానం జీవ మంతికాత్
ఈశానం భూతభవ్యస్య; న తతో విజుగుప్సతే ఏతద్వైతత్ ॥౫॥

సీ. కర్మ ఫలంబు భక్షణముఁ జేసెడివానిఁ,
బ్రాణాది నిచయధారయిత, జీవ
రూపు, నియ్యాత్మ సమీప సంస్థితునిగా,
కాలత్రియ నియామ కర్తగాఁగ,
నెవ్వఁడెఱుంగు; వాఁడికారణమున త
ద్విజ్ఞానమును బొందు పిదప, నభయ
సంప్రాప్తి, నాత్మరక్షణముఁ గావింపఁగఁ
దలపఁడు, భీతి మధ్యస్థుఁడగుచు
గీ. నే నసత్యుండ నంచు నూహించు వఱకె,
తన్నుఁ గాపాడఁ బూను, నద్వైతు నిత్యు
గా నెఱుఁగు నాత్మ నెపు, డప్డు దేని? నెవ్వఁ?
డెవనినుండి? రక్షించుఁ, వాఁడే యితండు.

యః పూర్వం తపసో జాత, మద్భ్యః పూర్వ మజాయత,
గుహాం ప్రవిశ్య తిష్ఠంతం యో భూతేభి ర్వ్యపశ్యత, ఏతద్వైతత్ ॥౬॥

గీ. బ్రహ్మసంజాతుఁడై తొల్త, పంచభూత
ములకు మొదలఁ గలిగి, దేవ ముఖ్య దేహ
ముల సృజించి, తద్గుహఁ బొందు భూతయుతుఁగ
ధాతఁ గాంతురి ముముక్షు; లాతం డితండె

యా ప్రాణేన సంభవ త్యదితి ర్దేవతామయీ
గుహాం ప్రవిశ్య తిష్ఠన్తీ యా భూతేభి ర్వ్యజాయత, ఏతద్వైతత్ ॥౭॥

---

‡ స్వప్నమధ్యము స్వప్నాంతమునగునట్టియు, జాగరితమధ్యము, జాగరితాంతమునగునట్టియు

గీ. ప్రథమజునితోడఁ దా పరబ్రహ్మమునకు
నొదవె నే దేవతామయి యదితి? యెవతె
భూతములతోడి జన్మంబుఁ బొంది ప్రాణి
హృదయముల వసియించు? నయ్యదితి యిదియె॥

ఆరణ్యో ర్నిహితో జాతవేదా గర్భ ఇవ సుభృతో గర్భిణీభిః
దివే దివే ఈడ్యో జాగృవద్భిర్హవిష్మద్భి ర్మనుష్యేభిరగ్నిః, ఏతద్వై
తత్ ॥౮॥

సీ. అధియజ్ఞుఁడును, నుత్తరాధరారణులందు
సంస్థితుం, డయిన యే జాత వేదుఁ
డఖిలహవిర్భోక్త, యధ్యాత్మ్మఁగుట *సం
తర్వర్తినులనిందితాన్నపాన
భోజనాదుల, గర్భమును గాచు పోలికఁ,
గాచు బుత్విగ్యోగి గణము వీని
ప్రతిదినంబును జాగరణశీలు, రాజ్యాది
మంతులునైన, కర్మతులచేత

గీ. స్తుత్యుఁడై; యట్ల యప్రమత్తులును, ధ్యాన
భావనావంతులగు యోగి వరులచేత
వంద్యుఁడై, యిట్లు మానవ ప్రార్థనీయు
డయిన, యయ్యగ్ని, ప్రకృతుఁడౌ నాత్మయె సుమి.

యతశ్చోదేతి సూర్యోఽస్తం యత్ర చ గచ్ఛతి
తం దేవా స్సర్వే అర్పితా స్తదు నాత్యేతి కశ్చన, ఏతద్వైతత్ ॥౯॥

గీ. ఎవని నుండి సూర్యుండుదయించు? నెచట
నస్తమించు? నెవ్వానియం దఖిల దేవ
తలును రథచక్రమున ‡నరంబులటులుందు?
రతని నొకఁడును మీరలేఁ, డతఁ డితండె.

---

* గర్భిణీస్త్రీలు.

‡ ఆకులు.

య దేవేహ తదముత్ర, య దముత్ర తదన్విహ,
మృత్యోస్స మృత్యు మాప్నోతి య ఇహ నానేవ పశ్యతి ॥౧౦॥

సీ. కార్యహేతూపాధి కలితమై సంసార
ధర్మముల్ గలిగిన దాని రీతి
నవివేకి జనముల కవభాసమానమై
జీవునం దేది వసించి యుండు,
వివిధ సంసార ధర్మవియుక్త నిత్య వి
జ్ఞానస్వభావమై జరుగునదియె
వసియించు కారణోపాధియందునను, నె
య్యది యున్న యదియె యియ్యాత్మయందు.

గీ. నద్దియే వసించునది రూ, పాభిధేయ,
కార్య, కారణోపాధులు గలిగియున్న
యట్టి జీవునియందును; నను విభావ్య
మానమగుచు; నొండేదియుఁ గానరాదు.

సీ. ఇట్లు వస్తుస్థితి యేప్పడియుండ, ను
పాధిస్వభావంబు, భేదదృష్టి
యను, లక్షణంబుగా నున్న యవిద్యచే
తను మోహితుండైన మనుజుఁ డెవ్వఁ;
డద్వితీయమగు బ్రహ్మంబునందుఁ; "పర
బ్రహ్మంబుకంటెనేఁ జరుఁడ నగుదు
నబ్బ్రహ్మమును భిన్నమైనది నాకంటె"
నని వేఱుగాఁ జూచు; నట్టివాఁడు

గీ. మాటిమాటికి మరణ జన్మములఁ బొందుఁ;
గాన భేద దర్శన మయుక్తము; "నిరంత
రంబుగ నభంబు పోల్కి పూర్ణంబయి తగు
బ్రహ్మమేన విజ్ఞానై క రసము;" ననుచు
సర్వము నభేద దృష్టిఁ గాంచంగవలయు.

మనసైవేద మాప్తవ్యం నేహ నానాస్తి కించన
మృత్యోః స మృత్యుం గచ్ఛతి య ఇహ నానేవ పశ్యతి ॥౧౧॥

ఉ. స్వాంతముచేతనే పడయ శక్యమగున్ బరమాత్మ, భేదమా
వంతయుఁ గూడలే దితనియం; దిటులుండఁగ బ్రహ్మమం దవి
ద్యాంతరవర్తి యెవ్వఁ డణువంత పృథక్త్వము గల్గినట్లు కాఁ
జింత యొనర్చు; వాఁడు మృతిఁ జెందు, జనించు, నిరంతరంబుగన్

అంగుష్ఠమాత్రః పురుషో మధ్య ఆత్మని తిష్ఠతి,
ఈశానో భూతభవ్యస్య న తతో విజుగుప్సతే, ఏతద్వైతత్ ॥౧౨॥

సీ. అంగుష్ఠపరిమాణమగు హృత్కమలమందు
తచ్ఛిద్రి సంస్థితాంతఃకరణ ము
పాధిగా, నంగుష్ఠ పరిమాణయుత వంశ
పర్వ మధ్యస్థితాంబరముభాతి,
నంగుష్ఠ పరిమాణుఁడగు పురుషుండు, శ
రీరమధ్యమున వర్తిల్లుచుండు
కాలత్రియ నియామకర్త్ర యీ జీవుండో
యంచు నెఱింగి యున్నట్టివాఁడు

ఆ॥ పరము లేమివలన, భయము నెఱుఁగమి
నాత్మరక్షణంబు నాచరింపఁ
దలఁపకుండు, నన్నుఁ దర్కించి యడిగితి
వీవు, తత్పదార్థ మిదియెసుమ్మ.

అంగుష్ఠ మాత్రః పురుషో జ్యోతి రివాధూమకః,
ఈశానో భూతభవ్యస్య స ఏవాద్య స ఉశ్వః, ఏతద్వైతత్ ॥ ౧౩॥

సీ. అంగుష్ఠ పరిమాణుఁడగు పురుషుం డధూ
మకము దాజ్యోతిస్సు మాడ్కి నగును,
కాలత్రియా నియామకర్తగా నీతని
హృదయాంబులను యోగు లెఱుఁగుచుందు,

రాతఁడే కూటస్థుఁ డతఁడె నిత్యుండు, నేఁ
డున్న జంతువులయందుండువాఁడె,
యతఁడె రేపుండంగలట్టి ప్రాణులనుండు,
నతనికి నెనవచ్చునట్టి పరుఁడు

గీ. పొడమఁ, డీతండ నీచేత, నడుగఁబడిన
వాఁడు; న్యాయానుసార మప్రాప్తమయ్యె
నాత్మలేఁడను పక్షంబు, నట్లనె క్షణ
భంగవాదమ్ము, ఖండింపఁ బడియె నిందు.

యథోదకం దుర్గే వృష్టం పర్వతేషు విధావతి,
ఏవం ధర్మాన్ పృథక్ పశ్యం స్తానేవాను విధావతి ॥౧౪॥

గీ. ఉచ్ఛ్రితస్థలిఁ గురియుచునున్న జలము
పర్వతవికీర్ణమై నశింపఁబడు రీతి,
జీవ పరమాత్మ భేద దర్శి యగువాఁడు
మాటిమాటికి దేహధర్మములఁ బడయు.

యథోదకం శుద్ధే శుద్ధ మాసిక్తం తాదృగేవ భవతి
ఏవం మునే ర్విజానత ఆత్మాభవతి గౌతమ! ॥౧౫॥

ఇతి కాఠ కోప నిషది ద్వితీయాధ్యాయే
ప్రథమావల్లీ సమాప్తా.

చ. అమలజలమ్మునందు విమలాంబువు వోయఁగ నేకమై విశు
ద్ధమగు విధంబునన్, మనన తత్పర బుద్ధిఁ బరిగ్రహించి వై
క్యమును నెఱుంగువానిదగు నాత్మయుఁ నేకరసంబు, నట్లశు
ద్ధము, నగుఁ గాన గౌతమ: కుతార్కిక దృష్టిఁ బరిత్యజింపుచూ!

మ. తలిదండ్రుల్ తమ బిడ్డలందుఁగల తాత్పర్యంబునన్, తద్ధితో
క్తుల లాలించుచునుండు చందమున, నెంతో ప్రేమతో*తత్సహ

* మాతాపితృ.

స్త్రీలకంబున్ శూద్రీతివారిణి సౌఖ్యమిటు గోరుంగాన౯ దద్వేదసూ
క్తుల బ్రిహ్మైక్య మెఱుంగ౯ గోరుట, ముముక్షు శ్రేయ, మూహిం
పరే,

ఇది యాంధ్రి శార కోప నిషత్తునంగల

రెండవ యధ్యాయమందలి మొదటివల్లి.

---

# ఉద్ధకాఠకోపనిషత్తు

ద్వితీయాధ్యాయము — ద్వితీయ వల్లి.

పురమేకాదశద్వారమజస్యావక్రచేతసః
అనుష్ఠాయ నశోచతి, విముక్తశ్చ, విముచ్యతే ॥౧॥

మ. పదునొక్కండగు ద్వారముల్ గలిగి, తత్పాలాదిసంయుక్తమై
నది దేహాఖ్యపురం, బవక్రమగుచున్ భాసించు విజ్ఞాన సం
పద నొప్పారెడు వేనికిం గలదొ, తద్బ్రహ్మంబు ధ్యానించినన్
వ్యధలం బాయు, కుధాదులన్ విడచు, జన్మంబొందఁడింకెన్నడున్

హంసః శుచిష, ద్వసు రంతరిక్షస,
ద్ధోతా వేదిష, దతిథి ర్దురోణసత్,
నృష, ద్వరస, దృతస, ద్వ్యోమసత్,
అబ్జా, గోజా, ఋతజా, అద్రిజా, ఋతం, బృహత్ ॥౨॥

సీ. ఆదిత్యుఁడై నిర్మలాభ్రంబునందుండు,
గాలియై యాంతరిక్షముననుండు,
అగ్నియై వేదియందు దధి వసించుచునుండు,
*నతిథియాచు 1దురోణమందెసంగు,
నతఁడె యంతర్యామియై మనుష్యులయందు,
దేవతలందు వరిల్లుచుండు,
2ఋతమునందుండు వసించు నాకసమున,
వ్రీహ్యాదిరూపుఁడై పృథివిఁబొడము,

* సోమరసస్వరూపుఁడు లేక అతిథి.
1 ద్రోణకలశము లేక గృహము.
2 యజ్ఞమునందు లేక సత్యమునందు.

గీ. శంఖ శుక్త్యాదులయి పుట్టు జలములందుఁ
యజ్ఞముల కంగముగఁ గల్గు; నదురిలందుఁ
బాడము నదాద్యాది రూపమ్ముఁ బూని; యిట్టు
లయ్యు సత్యస్వభావుఁ డియ్యాత్మఘనుఁడు.

ఊర్ధ్వం ప్రాణ మున్నయ త్యపానం ప్రత్య గస్యతి
మధ్యే వామన మాసీనం విశ్వే దేవా ఉపాసతే ॥౩॥

చ. హృదయముకంటె నూర్ధ్వముగ నీతఁడు ప్రాణముఁబొందఁ జేయుఁ
వ్విధిగ నధగ స్థలమ్మునకు వీఁడె యపానముఁ బొందఁ జేయుఁ, ద
నెదఁగల బుద్ధియందెసగు నీతని సంభజనీయుఁ గొల్తుర
త్రిదశులు;* చక్షురాదులు నధీశుఁ బలెన్ †బలినాత్మఁగొల్పెడిన్

అస్య విస్రం సమానస్య శరీరస్థస్య దేహినః
దేహా ద్విముచ్యమానస్య కిమత్ర పరిశిష్యతే ? ॥౪॥

గీ. దేహసంస్థితుఁడైనట్టి దేహి తనువు
నుండి విడివడుచుండ నేమున్నదింక ?
నృపతిపోఁ బురవాసులరీతిఁ, గార్య
కారణ కలాప మిదియెల్లఁ గదలిపోదె ?

న ప్రాణేన నాఽపానేన మర్త్యో జీవతి కశ్చన
ఇతరేణతు జీవంతి యస్మి న్నేతా వుపాశ్రితా ॥౫॥

సీ. "ప్రాణాది నాశమ్ము వలననే మేను వి
ధ్వస్తమౌచుండు, నవ్వాని కలిమి
మనుజుండు జీవించు" నని తలంపఁగరాదు
ప్రాణమ్ముచేత, నపానమునను,
చక్షురాదులను, నే జనుఁడు జీవింపఁడు,
కలసి కార్యముఁ సేయుఁ గావున, నివి
జీవనహేతువుల్ గావు, భూపతి కార్య
కార నానాభృత్యగణమురీతి

---

* సామాన్యప్రజ లుపాయనముల చే నధీశ్వరుని సేవించునట్లు
† రూపాది విజ్ఞానరూపమగు బలిచే

గీ. నగుఁ బరప్రియుక్తములు, పరార్థములును;
నెవ్వఁ డుండంగ నివి యాశ్రయించు, నేత
దఖిల సంఘాతభిన్నుఁ డైనట్టి యాత్మ
వలననే ప్రాణి తతి జీవవంతమయ్యె.

హన్త త ఇదం ప్రవక్ష్యామి, గుహ్యం బ్రహ్మ సనాతనమ్
యథాచమరణం ప్రాప్య ఆత్మా భవతి గౌతమ! ॥౬॥

క. దేని నెఱుఁగ సంసారము
రానేరదొ, దేని నెఱుఁగ రామిఁ గలుగు, న
ద్దాని నచికేత! యతి ప్రా
చీన రహస్యమును నీకుఁ జెప్పెద వినుమా!

యోని మన్యే ప్రపద్యంతే శరీరత్వాయ దేహినః,
స్థాణు మన్యేఽనుసంయంతి, యథాకర్మ, యథాశ్రుతమ్! ॥౭॥

ఉ. మందలి జ్ఞానసంపదకు, ముందలి కర్మకు నర్హమౌ విధిన్
గొందఱు శుక్రబీజములఁ గూడుక మూఢులుగాన దేహమున్
జెందగ గర్భమందున వసించెద; రజ్ఞతముల్ మహాధముల్
గొందఱు స్థాణుభావమును గొందుఱు, మృత్యువుఁబొందుపిమ్మటన్

య ఏష సుప్తేషు జాగర్తి కామం కామం పురుషో నిర్మిమాణః,
త దేవ శుక్రం తద్బ్రహ్మ, తదేవామృతముచ్యతే
తస్మింల్లోకాః శ్రితా స్సర్వే, తదు నాత్యేతి కశ్చన, ఏతద్వైతత్ ॥౮॥

శా. ప్రాణాదుల్ నిదురించుచుండ, వనితాసృక్ముఖ్యమౌ కామ సం
తానంబెల్ల నవిద్యచే నెవఁడు సంస్థాపించుచున్ మేల్కొనుం
డా; నాతండె విశుద్ధమై యమృతమౌ తద్బ్రహ్మ;*మూర్ధ్వాదులం
దే నిల్చున్; బరమాత్మకన్న మఱి వేఱేదే నొకండున్న దే?

మ. "ఒకఁడే యాత్మ గలం"డటంచు శ్రుతి యెన్నో మారులన్నన్ గుతా
ర్కిక, పాషండ, విచాలితాత్మకులు, వక్రీభూతబుద్ధుల్, కరం

* సర్వలోకకారణభూతుఁడగు నీబ్రహ్మమునందే

బకటా! బ్రాహ్మణులైక్యముం దెలియలే"రంచామెయే సాదరా
త్మకమై దానిన తెల్పుఁ గ్రింద పునరుక్తత్వమ్ముఁ బాటింపకన్.

అగ్నిర్య థైకో భువనం ప్రవిష్టో
రూపం రూపం ప్రతి రూపో బభూవ,
ఏకస్తథా సర్వభూతాంతరాత్మా
రూపం రూపం ప్రతి రూపో బహిశ్చ ॥౯॥

మ. *అతఁడొక్కండెఘనంజయుండుఃభువనంబందొప్పుచున్, దాహ్యమా
ప్రతి దార్వాది విభేదకోటికి సమర్హ్యంబౌ విధానంబునన్
బ్రతిరూపుండగునట్లు; భూతములలోనన్, బైన, నభ్రింబు నాఁ
బ్రతిరూపంబున కర్హమైన ప్రతిరూపంబూను వీఁడొక్కఁడై.

వాయుర్యథైకో భువనం ప్రవిష్టో
రూపం రూపం ప్రతి రూపో బభూవ,
ఏకస్తథా సర్వభూతాంతరాత్మా
రూపం రూపం ప్రతి రూపో బహిశ్చ ॥౧౦॥

మ. అతఁడొక్కండె ప్రభంజనుండు భువనంబందుం బ్రవేశించి దా
ప్రతిదేహంబున కర్హమైన ప్రతిరూపంబూను నట్లొక్కఁడే
యతఁడై భూతగణాంతరాత్ముఁడుగఁ దానయ్యంబయిం భాసిలున్
బ్రతిరూపంబున కర్హమైన ప్రతిరూపంబూని, యభ్రంబటుల్.

సూర్యో యథా సర్వలోకస్య చక్షు
ర్న లిప్యతే చాక్షుషై ర్బాహ్యదోషైః;
ఏక స్తథా సర్వభూతాంతరాత్మా
న లిప్యతే లోకదుఃఖేన బాహ్యః ॥౧౧॥

ఆ. "అఖిలమునకు నొకఁడె యాత్మయానేని సం
సార దుఃఖమెల్ల సంభవించు
నట్టి పరుని కే" యటంచు సంశయమురాఁ
దెలుపు శ్రుతియె తేటతెల్లముగను.

---

* "ఒక్కఁడే యగు నగ్ని" యని యర్థము.

గీ అఖిలలోక చక్షురూపుతుఁడయ్యు, ద్యుమణి
చాక్షుషములగు బాహ్యదోషములనంటఁ;
డట్లొకఁడె సర్వభూతాంతరాత్ముఁడయ్యు,
నాత్మ, లోకదుఃఖమ్ముచే నంటఁబడఁడు.

సీ. జగమునం గల ప్రాణి జాతమంతయు నవి
ద్యామోహితంబు, భ్రాంతంబుఁ, గాన
కామకర్మంబులం గలిగిన దుఃఖమ్ము
నాత్మ కారోపించి, యార్తిఁజెందు,
నిజమాత్మయందు లేనేలేఁడవిద్య; ర
జ్వాదులయందు సర్పాదికంబు
లేకుండినను, విపరీతబుధ్యధ్యాస
మున నజ్ఞులవియున్నవనితలంతు,

గీ. రట్టి రజ్వాదు లేతదధ్యాస బాహ్య
మైన, వట్లాత్మ సర్వభూతాంతరాత్ముఁ
డయ్యు, విపరీతమైన యధ్యాసమునకు
బాహ్యుఁడై లోకదుఃఖసంస్పర్శఁగనఁడు.

ఏకో, వశీ, సర్వభూతాంతరాత్మా
ఏకం రూపం బహుధాయః కరోతి,
త మాత్మస్థం యేఽనుపశ్యంతి ధీరా,
స్తేషాం సుఖం శాశ్వతం, నేతరేషామ్ ॥౧౨॥

గీ. అల్పుఁ, డధికుఁడు, సముఁడు, లేనట్టివాఁడు,
కావున స్వతంత్రుఁడును, సర్వగతుఁడు, నాత్మ
యఖిలజగము నాతని వశంబందయుండు;
నతఁడె సర్వభూతములకు నంతరాత్మ.

మ. అమలజ్ఞాన ఘన స్వరూపము నొకండౌ దాని, రూపాహ్వయ
ప్రముఖోపాధివశంబుచే బహుగతుల్గాఁ జేయు నీతం, డచిం
త్యమహత్త్వంబున; నద్దమందు ముఖమట్లాత్మం బ్రకాశించు బ్ర
హ్మముఁగన్ ధీరుల కబ్బు నిత్య సుఖ; మన్యప్రాప్త మెట్లయ్యెడిన్?

నిత్యోఽనిత్యానాం చేతన, శ్చేతనానా
మేకో, బహూనాం యోవిదధాతి కామాన్
త, మాత్మస్థం, యేఽనుపశ్యంతి ధీరా,
స్తేషాం శాంతిః శాశ్వతీ, నేతరేషామ్ ॥౧౩॥

గీ. ఏకమై యున్న యేపరమేశ్వరుండు
పలువురకు వారి వారి కర్తలకుఁ దగిన
ఫలముల నొసంగు, నాపరాత్పరుఁడ నిత్యు
లైన వారలలో నిత్యుఁడైనవాఁడు.

గీ. చేతనప్రాణితతిలోన చేతనుండు,
స్వతను హృదయాభ్రగతబుద్ధిఁ బరగు నతని,
ధీరు లెవ్వారు సూతు, రవ్వారు నిత్య
శాంతిఁగాంతురు, పరులట్టి శాంతిఁ గనరు.

"తదేత" దితి మన్యంతేఽనిర్దేశ్యం పరమం సుఖమ్
కథం ను తద్విజానీయాం కిము భాతి విభాతివా ॥౧౪॥

మ. "అది, యను"ట్లంచును నిర్ణయించుట కశక్యంబుత్తమంబాసుఖం
బెదియో, దాని 'నదే యి'దంచును దలంత్రీ బ్రహ్మవేత్తల్, నిజం
బది భాసించునె? నాదు బుద్ధి కది యత్యంతంబు విస్పష్టమై
నదియై వెల్గునె? దాని నేనెఱుఁగఁగఁ శక్తుండ నెట్లయ్యెదన్?

"న తత్ర సూర్యో భాతి," న చంద్ర తారకం
నేమా విద్యుతో భాంతి, కుతోఽయ మగ్నిః?
త మేవ భాంత మనుభాతి సర్వం
తస్య భాసా సర్వమిదం విభాతి ॥౧౫॥

ఇతి కాఠ కోప నిషది ద్వితీయాధ్యాయే
ద్వితీయావల్లీ సమాప్తా.

మ. రవియుం, జందురుఁడు, రిక్కలున్, మెఱుపులున్, బ్రహ్మంబు వెల్గింపఁజా
లవు, వైస్వానరుఁ జెప్పనేటికి ? పరబ్రహ్మాను సారంబులై
యివి, తా మెల్ల పరప్రకాశమున నెంతే భాసిలుం, గార్యమం
దవు కాంతిప్రసరంబుచే నెఱుఁగశక్యం బాత్మవిద్యోతమున్.

ఇది యాంధ్ర కాఠకోపనిషత్తునంగల
రెండవయధ్యాయమందలి రెండవవల్లి.

---

# ఆంధ్ర కారక కోప నిషత్తు

---

## ద్వితీయాధ్యాయము — తృతీయవల్లి.

౬

ఊర్ధ్వమూలోఽవాక్ శాఖః, ఏషోఽశ్వత్థః, సనాతనః
తదేవ శుక్రం, తద్బ్రహ్మ, తదేవామృతముచ్యతే
తస్మింల్లోకాః శ్రితాస్సర్వే, తదునాత్యేతి కశ్చన, ఏతద్వైతత్ ॥౧॥

గీ. ఎండమావుల చందాన, నింద్రజాల,
మట్లు, గంధర్వపురిపోల్కి, నకట ! తోఁచు
చున్నటులనుండి నశియించుచుండుఁగాన
సత్యమింతయుఁ గలదె సంసారమందు.

గీ. మరణజననాద్య నర్థసమన్వితంబు,
ప్రతి నిమిషభంగురము నభావాత్మకంబు
నగుట సంసార మెటుఁగ శక్యంబె ?
యిది యసారమైనది కదళికా స్తంభమట్లు.

సీ. మాలిక. ప్రాఁబల్కు-కొనల నిర్ధారితంబగు
పరబ్రహ్మంబు మూలసారమ్ముగాఁగ,
అజ్ఞాన, కామకర్మాజ్ఞాత చైతన్య
ములను, బీజమున నుద్భూతిగాఁగ
అపర విజ్ఞాన, క్రియాశక్తియుఁగ రూపుఁ
డయిన పితామహుం డంకురముగ
జగమునం గల సర్వజంతులం గల లింగ
దేహముల్ చెట్టుబోదెలవిగాఁగ
దర్పంబుఁ గలిగింపఁ దగిన తృష్ణా సలి
లంబుచేఁ దనకు సేకంబుగాఁగ

జ్ఞానేంద్రియార్థంబులైన శబ్దరసాది
కములు *ప్రవాళాంకురములుగాగ
అఖిల శ్రుతి, స్మృతి, న్యాయ విద్యోపదే
శమ్ములయ్యవి పలాశములుగాగ
యజ్ఞాదికము కుసుమావళిగాగ, దుః
ఖసుఖ వేదనలెల్ల రసములుగను
ప్రాణ్యుపజీవ్యమై పరగెడు పుత్రాశ్వ
పశ్వాదికంబెల్ల పండ్లుగాగ
ఫలతృష్ణయను జలంబులు వోయ నెదిగిన
కర్మవాసనలెల్ల ‡కాండములుగ
సప్తలోకంబులు సకలభూతంబులు
ననెడి ఖగావళి కాశ్రయముగ
జంతుహర్షాది సంజాత సంగీత, హా
హాదిధ్వనులు పక్షినాదములుగ
ఆగమవిహిత బ్రహ్మాత్మ సందర్శనా
సంగశస్త్రము హింసనముగాగ

గీ. కామకర్మానిలంబుచే గంపిత, మ్మ
నారతము చలించునది, సనాతనంబు
స్వర్గ, నరకాది శాఖోపశాఖలెసఁగ,
వరలు సంసారమనెడి యశ్వత్థ తరువు.

మ. †తరుమూలం, బమృతంబు, శుద్ధమగు, నేతద్బ్రహ్మమత్యంతమున్
బరమార్థంబగు; వీని యొద్ద భువనవ్రాతంబు చూపట్టున
య్యరె! గంధర్వపురీ, మరీచ్యుదక, మాయా, తుల్యమై; కార్యమై
పరగెం గాన నతిక్రమింపదు పరబ్రహ్మాఖ్యమా హేతువున్.

* చిగురుటాకులు, మొలకలు.

‡ అవాంతరమూలములు.

† సంసారమునకు కారణము.

యదిదం కించ జగత్సర్వం ప్రాణఏజతి నిఃసృతమ్
మహద్భయం వజ్ర ముద్యతం యఏత ద్విదు రమృతా స్తే భవంతి॥౨॥

క. "జగముల కెల్లను మూలం
బగు బ్రహ్మమె లేదసత్తునందుద్భూతం
బగునవి లోకము"లని 'యనఁ
దగ'దని శ్రుతి స్పష్టమగు విధాన నిటులనున్.

మ. పరమాత్మ స్థితిచేత నిజ్జగము సర్వంబుద్భవం బై నరే
శ్వరు, దండోద్యతపాణిఁ గన్గొని భయభ్రాంతాత్ములై భృత్యులె
ల్లరు తచ్ఛాసనవర్తులౌ పగిది వజ్రంబెత్తెనో నాభయుం
కరుఁడౌ నాత్మభయంబుచే నియతమౌ కర్మంబుఁ గావించెడిన్.

క. ఎవరు నిజాంతఃకరణ
ప్రవృత్తులకు సాక్షిభూతు, బ్రహ్మము నెఱుం
గవలంతులో, యవ్వారల
కవు మోక్షావగతి, మరణమందరువారల్.

భయా దస్యాగ్ని స్తపతి, భయా త్తపతి సూర్యః,
భయా దింద్రశ్చ, వాయుశ్చ, మృత్యుర్ధావతి పంచమః ॥3॥

గీ. వానికి భయంపడి తపించు పావకుండు,
వానికి భయంపడి తపించు భాస్కరుండు,
వాయు, విందుండు, నైదవవాఁడు యముఁడు,
నతనిమెడ భీతిఁ దమ పనులాచరింతుర్.

ఇహ చే దశక ద్బోద్ధుం ప్రాక్ శరీరస్య విస్రసః
తతః సర్వేషు లోకేషు శరీరత్వాయ కల్పతే ॥౪॥

ఉ. భీతికిఁ గారణంబయిన వీని శరీరము వోక మున్నె, యి
బ్భూతలమందెఱింగిన విముక్తుఁడగున్ మరణాదికంబుచేఁ;
బీతని నిల్లెఱుంగమి, జనించుచుఁ జచ్చుచునుండుఁ; గావునన్
భౌతిక దేహమున్నపుడె బ్రహ్మమెఱింగిడి పూన్కి, మేలగున్.

యథాదర్శే తథాత్మని, యథాస్వప్నే తథాపితృలోకే,
యథాప్సుపరీవ దదృశే తథాగన్ధర్వలోకే,
ఛాయాతపయోరివ బ్రహ్మలోకే ॥౫॥

మ. వదనంబద్దమునందుఁ దోఁచు విధి విస్పష్టంబుగా బ్రహ్మ మి
య్యెదఁ దోఁచున్, బితృలోకమందు కలయందె; ట్లట్ల విస్పష్టమా
నది; గంధర్వజగంబునందు నుదకంబందట్ల విస్పష్టమా
నది; ఛాయోష్ణమఃలందుఁ బోలె స్ఫుటమాన బ్రహ్మలోకంబునన్

గీ. బ్రహ్మలోకంబునందు, నివ్వసుధయంద
కాని యాత్మదర్శన మెందు కడలఁ బొంద
రాదు; బ్రహ్మజగంబొ దుష్ప్రాప, మగుటఁ
విడువక ప్రయత్న మిందె కావింపవలయు.

ఇంద్రియాణాం పృథగ్భావ, ముదయాస్తమయౌచయత్
పృథగుత్పద్యమానానా మత్వా ధీరో న శోచతి ॥౬॥

మ. "శ్రవణాద్యర్థము భూతజాతమగు శ్రోత్రాదీంద్రియవ్రాతమె
ల్ల విశుద్ధాత్మునికంటె భిన్న; మిదియే ప్రాపించుచుండున్ సము
ద్భవనాశంబులనెల్ల; ఆత్మ యది నిత్యైక స్వభావం"బటం
చు, విచారించిన ధీరుఁ డెట్టి దశలన్ శోకింపఁడావంతయున్.

ఇంద్రియేభ్యః పరం మనో మనసః సత్త్వముత్తమమ్
సత్త్వాదధి మహానాత్మా మహతోఽవ్యక్త ముత్తమమ్ ॥౭॥
అవ్యక్తాత్తు పరః పురుషో వ్యాపకోఽలింగ ఏవచ
య జ్ఞాత్వా ముచ్యతే జన్తు రమృతత్వం చ గచ్ఛతి ॥౮॥

గీ. ఇంద్రియంబులకన్న నిద్యోదపరంబు,
స్వాంతమునకంటె బుద్ధిశ్రేష్ఠంబు మిగుల,
దానికంటెను మహదాత్మ, దానికంటె
నఖిల కారణ మవ్యక్త మగు పరంబు.

గీ. పురుషుఁ డవ్యక్తమునకంటెఁ బరుఁడుఁ వ్యాప
కుండు, బుద్ధ్యాదిగుణవియుక్తుండు నగును
వాని నెఱిఁగినప్రాణి జీవదశయంద
యజ్ఞతను బాయు, మేనువోనమృతుఁడగును.

న సంద్రృశే తిష్ఠతి రూప మస్య,
న చక్షుషా పశ్యతి కశ్చనైనమ్,
హృదా మనీషా మనసాఽభిక్లృప్తో
య ఏత ద్విదు రమృతాస్తే భవంతి ॥౯॥

గీ. సర్వ సంసార ధర్మ వర్జనముఁ గన్న
వాఁడు బ్రహ్మ, మా తనికి రూపంబు లేదు
రూపవద్వస్తువు నె జనుల్ చూడఁగలరు,
కాన దర్శన విషయుండు గాఁడితండు.

గీ. ఇంద్రియంబుల నెవఁడు గ్రహింపఁజాలఁ
డతని, మనమును నియమించునట్టిదగుచు,
మనన రూపమ్ము, హృద్గతమ్ము, నగునట్టి
బుద్ధిచేతనే యాత్మను బొందవలయు.

క. ఎవరు నిజాంతఃకరణ
ప్రవృత్తులకు సాక్షిభూతు బ్రహ్మమ్ము నెఱుం
గవలంతులో, యవ్వాగల
కవు మోక్షావగతి, మరణమందరు వారల్.

యదా పంచావతిష్ఠంతే జ్ఞానాని మనసా సహ,
బుద్ధిశ్చ న విచేష్టతే, తామాహుః పరమాం గతిమ్ ॥౧౦॥

చ. స్వవిషయ సన్నివృత్తమగు జ్ఞానములైదును, నాత్మయంద, త
ద్వివిధవికల్ప *ముఖ్యవినివృత్తమనస్సహితంబులొాచు నె
ప్డు విలసిలున్, విచేష్టయయి బుద్ధియు వర్తిలుచుండు; నట్టియో
గ్యవిధగతిం బ్రకృష్టగతియంచు వచింతురు పండితోత్తముల్.

తాం యోగ మితి మన్యంతే స్థిరా మింద్రియ ధారణామ్,
అప్రమత్త స్తదా భవతి, యోగోహి ప్రభవాప్యయౌ. ॥౧౧॥

గీ. దాని బాహ్యాంత రింద్రియ ధారణను స్థి
రంబయిన దాని బుధులు యోగంబటంచు
నెంచెద, రనర్థతతి నశియించునంత
దీన నాత్మ, స్వరూప ప్రతిష్ఠుఁడగును.

* ముఖ్యశబ్దము చే సంకల్పము గ్రహింపనగు.

గీ. అప్పుడు సమాధికొఱకు ప్రయత్నమూన
వలయు, బుద్ధ్యాదికము చేష్టఁ బాయునప్పు
డప్రమత్తుండగు; నదేలయనఁగ యోగ
మది‡యుపజనాపాయధర్మాన్వితంబు.

నైవ వాచా, నమనసా, ప్రాప్తుం శక్యో నచక్షుషా
అస్తీతి బ్రువతోఽన్యత్ర కథం తదుపలభ్యతే ౧౨॥

క. పలుకువలన, మనమున, చూ
పుల నెవ్వానికిని నాత్మ పొడసూపఁ, డిఁకన్
గలఁడనియెడి విశ్వాసముఁ
గల యాతఁడె కాని, యొరుఁడు గనుఁగొనఁ డతనిన్.

అస్తీత్యేవోపలబ్ధవ్యస్తత్త్వభావేనచోభయోః
అస్తీత్యేవోపలబ్ధస్య తత్త్వభావః ప్రసీదతి ॥౧౩॥

సీ. ఆసురం బైనట్టి నాస్తికవాదంబు
త్యజియించి, యాస్తికం బాశ్రయింప
వలయును, దొల్త సోపాధికునాత్మ న
స్తిత్వ భావంబుచేఁ దెలిసికొనిన,
నామరూపోపాధి నాశంబుగల యాత్మ
తత్త్వభావంబు ప్రాప్తమగుఁ బిదప;
విదితావిదితభిన్న, మిది యద్వయము, నేతి
నేతి ప్రముఖవాక్య నిర్ణితంబు

గీ. నరస, మస్థూల, మనణువు, నైన యట్టి
'దస్తి'యను భావమును పూర్వమాశ్రయించు
వానికె లభించు నాత్మ తత్త్వంబు; గాని
యన్యునకుఁ దత్ప్రకాశ మెట్లబ్బఁగలదు?

‡ [ చిత్తవిక్షేపరాహిత్యాది సత్వగుణముల ] పుట్టుక ఉపజనము (రాగద్వేషచిత్తవిక్షేపాదుల) నాశము అపాయము.

యదా సర్వే ప్రముచ్యంతే కామా యేఽస్య హృది శ్రితాః
అథ మర్త్యోఽమృతో భవత్యత్ర బ్రహ్మ సమశ్నుతే ॥౧౪॥

చ. బుధహృదయాశ్రితంబులగు మున్ గలకోరిక, లాత్మబోధకుం
డుదిఁ జను బుద్ధివీడి; తమిలో నితరంబు వహింపఁదోఁపమిన్
బిదప ప్రబోధపూర్వమున వీఁడొక మర్త్యుఁడె యయ్యు, జ్ఞానసం
పద నమృతుండగున్; విగతబాధముఁజెందు నిహముందబ్రహ్మమై.

యదా సర్వే ప్రభిద్యంతే హృదయస్యేహ గ్రంథయః
అథ మర్త్యోఽమృతో భవత్యేతావదనుశాసనమ్ ॥౧౫॥

సీ. "ఈ శరీరంబె నే, నీ ధనంబులు నావి,
యే నే సుఖాత్ముండ, నేనదుఃఖి"
నను నవిద్యా ప్రత్యయములు హృద్గ్రంథు లి
జ్జగతి జీవించియుండఁగనె యెపుడు
నే నీ శరీరమ్ముఁగా, నసంసారిని,
నేను బ్రహ్మమయుయున్నా" నని యెడి
బ్రహ్మాత్మప్రత్యయోపజననంబుననువి
నాశమందున్, తదనంతరమున

గీ. తన్నిమిత్తంబయిన కామతతి సమూల
ముగ నశించును; మరణ ధర్ముండు జీవుఁ,
డంత మరణశూన్యుండగు; నింతవఱకె
సర్వవేదాంతముల యను శాసనంబు.

శతం చైకా చ హృదయస్య నాడ్య,
స్తాసాం మూర్ధాన మభి నిస్సృతైకా,
త యోర్ధ్వ మాయ న్నమృతత్వ మేతి,
విష్వ జ్ఙన్యా ఉత్క్రమణే భవంతి ॥౧౬॥

శా. నాడుల్ నూట యొకండు గల్గు నెదలోనన్, వీన నొక్కండు, ల
న్నాడీ నామమగున్ సుషుమ్న, యది మూర్ధంబొంది వ్యాపించు,
న్నాడీ మార్గముగా హృదింగలుగు నాత్మం గొంచు ప్రాణంబు
వ్వాఁ డూర్ధ్వంబుగ బ్రహ్మరంధ్రమునఁ బైపైనేఁగఁగాఁ జేయుచున్.

గీ. అట్టిమందాధికారి బ్రహ్మజగమంది,
యంతమునఁ బరంబాదు; నన్యమ్ములైన
నాడులను నుత్క్రమణమందువాఁడు, వివిధ
మగు గతుల్గల సంసారమందుచుండు.

అంగుష్ఠ మాత్రః పురుషోఽన్తరాత్మా
సదా జనానాం హృదయే సన్నివిష్టః,
తం స్వాచ్ఛరీ రాత్ప్రవృహే
న్ముం జా దివేషీకాం ధైర్యేణ
తం విద్యా చ్ఛుక్రమమృతం
తం విద్యా చ్ఛుక్రమమృతమితి ॥౧౭॥



ఆ. అంతరాత్ముఁడగుచు, నంగుష్ఠ మాత్రుఁడౌ,
నట్టి పురుషుఁడెల్ల యవసరముల,
నఖిలమగు నవస్థలందును, జనహృద
యప్రవిష్టుఁడగుచు నలరుచుండు

గీ. ముంజనుండిఁయిషీకను బోలె, నట్టి
వానిని ప్రమాదవిరహితజ్ఞానమునను
స్వీయ దేహంబునందుండి వేరుపఱచి,
యతఁడె శుద్ధాత్ముఁడని తెలియఁగవలయు.
నతఁడె శుద్ధాత్ముఁడని తెలియంగవలయు.

మృత్యు ప్రోక్తాం నాచికేతోఽథ లబ్ధ్వా
విద్యా మేతాం యోగ విధిం చ కృత్స్నమ్
బ్రహ్మ ప్రాప్తో విరజోఽభూద్వి మృత్యు
రన్యోప్యేవంయో వి దధ్యాత్మమేవ ॥౧౮॥

మ. యముఁ డిట్లా నచికేతుతోఁ దెలుప, నుద్యద్బ్రహ్మ విద్యా విధా
నముఁ, గృత్స్నంబగునట్టి యోగసరణిఁ, బ్రాపించి, కామాదిరూ
పము సంసారము వోవఁ, దావిరజుఁడై బ్రహ్మంబుఁ జెందెన్; వరుం
డమృతుండై పరమాత్ముఁడౌ నిటులె యధ్యాత్మజ్ఞు గుర్తించినన్.

ఓం సహ నావవతు సహనౌభునక్తు, సహవీర్యం కరవావహై
తేజస్వి నా వధీతమస్తు మావిద్విషావహై.

ఓం శాంతిః శాంతిః శాంతిః.

ఇతి కాఠ కోప నిషది ద్వితీయాధ్యాయే
తృతీయావల్లీ సమాప్తా.

ఇది యాంధ్రి కాఠ కోప నిషత్తునంగల
రెండవయధ్యాయమందలి రెండవవల్లి
సంపూర్ణమాయెను.





కొని పఠింపుఁడు ! [illegible]

విద్యాప్రవీణ, ఉభయభాషాప్రవీణ

పంతుల లక్ష్మీనారాయణశాస్త్రిచే

విరచితము.

---

గీతికా మకరందము— వేదాంతతత్త్వబోధకములును, పరమేశ్వరధ్యానరూపములును, భక్తిసుధాఝరీ విలసితములును నగు పాటలతో విరాజిల్లుచుండును.

చిట్టాయవలస అగ్రహారము,

గజపతినగరము పోష్టు,

(విశాఖపట్టణము జిల్లా)